విశ్వసాహిత్యమాల 66.

# వ్యవసాయ సామెతలు

సంకలనకర్త:
నేదునూరి గంగాధరం.



1956 సెప్టెంబరు



విశ్వసాహిత్యమాల, రాజమండ్రి.

Vyavasaya Sametalu

By

Nedunuri Gangadharam.

Published by M. Jagan Mohan Rao,
Viswasahityamala, Rajahmundry.

అవంతీ ప్రెస్, రాజమండ్రి.

Title planned and drawn by Sri K. Vembu,
Artist.

మొదటి కూర్పు :
1000 ప్రతులు.

వెల రు 0-12-0

# ఉపోద్ఘాతము

శ్లో॥ రామాద్యాచయ మేదినీం ధనపతే బీజం బలాల్లాంగలమ్
ప్రేతేశాన్మహిషం తవాస్తి వృషభం పాలం త్రిశూలం కురు
శక్తాహం తవ చాన్నధానకరణే గోరక్షణౌ షణ్ముఖః
ఖిన్నాహం హర! భిక్షయా కరకృషిం గౌరీవచః పాతునః॥

వ్యవసాయం అతి ప్రాచీనమైనవృత్తి మిగిలిన వృత్తులన్నిటికీ మూలమైనది. లోకానుభూతమైన వ్యవసాయవృత్తి ప్రాధాన్యతను వేరే చెప్పవలయునా? 'ధాన్యలక్ష్మితో ధనలక్ష్మి ఓపదు' అను తెనుగుదేశ సామెత మన నాట వ్యవసాయము నకుగల ప్రాధాన్యతను సూచించుచున్నది.

తల్లి పెంచంగవలయు, ధరణి పెంచంగవలయు.
తల్లి యిచ్చిన పాలుకన్న ధరణి యిచ్చిన పాలుమిన్న

ఈ మొదలైన సూక్తులు కృషి యెంత ముఖ్యమైనదిగా పరిగణించబడినదో తెలుపుచున్నవి. 'కృషితో నాస్తి దుర్భిక్షం జపతో నాస్తి పాతకమ్' యను సంస్కృత లోకోక్తి కూడ యీ యర్థమునే సూచించుచున్నది.

పూర్వులు తమ యనుభవములను సూత్రప్రాయముగా చెప్పుచూ వచ్చినవే సామెతలైనవి. క్రమముగా కొన్ని నీతులు కథలు,బోధనలు మొదలైనవికూడ సామెతలుగా నిల్చియున్నవి.

## తెలుఁగు సామెతల ప్రాశస్త్యము.

సిసలైన తెలుఁగు నుడికారమునకు, అసలైన ఆంధ్ర జాతీయ సంప్రదాయ విజ్ఞానసంపదకు ఆకరములైన వీ యాంధ్ర లోకోక్తులు. జాను తెలుంగైన యీ జాతీయ భాషా పదజాలము నేఁటి మనవారల యుపేక్షమూలమున మూలఁబడి దేశీయ రంగమునుండి మాయమగుచున్నది. సామెతలను పరీ కించినచో, దేశీయులవృత్తులు, నాగరికతలు, నమ్మకములు, ఆచరణములు, అనుభవములు, వ్యవహారములు, చరిత్రలు, శాస్త్రములు మొదలగు విషయములు తేటతెల్లమగును. పైగా పసిఁడితునకలవంటి పదజాలముతో భాష విరాజిల్లుచుండును.

## సామెతలు ప్రసంగమునకు కళకాంతులు.

ప్రసంగించుచు నొక సామెతను ప్రయోగించినచో, అది ప్రసంగమునకు కాంతిఁ గలుగఁ జేయును.

ఉదా :— ముంజేతి కంకణమునకు అద్దమేల ?

జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జందె మెందుకు ?

అందరికి తెలిసిన వానిని గుఱించి, వేరే చెప్పనక్కర్లే దనే తావులలో నీ సామెతలను ప్రసంగించెదరు.

## సామెతలు ధ్వని ప్రధానములై యుండును.

ప్రతి సామెతలోను ధ్వనియుండును. అనగా:— లోకోక్తి లోని మాటలు ఉన్నవి యున్నట్లు అర్థము చేసుకొన్నచో,

ప్రస్తుత విషయమునకు సంబంధములేని మాటలుగ కనబడును. కాని, అందులోని ధ్వని ప్రస్తుత విషయమునకు సంబంధించి యుండును.

ఉదా :— "ఎంత బలిసినా గొఱ్ఱెకు బొత్తెడేతోక".

ఏమి చేసినప్పటికిన్ని, బాగుపడని వానిని గుఱించి చెప్పే సందర్భములో యీ లోకోక్తి వాడెదరు.

సామెతలు సూత్రప్రాయముగ నుండును.

ఇవి చిన్నచిన్న వాక్యములలో, సూత్రప్రాయముగా నుండును. వీటిలోని భావము, సొగసు, తర్కించినకొద్దీ వచ్చుచుండును.

ఉదా :— "కుక్క బలిస్తే, గోనెలు మోస్తుందా ?"

తక్కువవా డెంత నేర్చినా గొప్పవాఁడు కానేరఁడని అర్థము.

"చింత చచ్చినా ! పులుపు చావదు".

గొప్పవాఁ డెంత చెడిపోయినను, పూర్వపు ఘనత కొంచెమైనను సూచించుచుండును. ఈ సామెతలు ఆ యా సందర్భములలో నుపయోగించెదరు.

సందర్భమునుబట్టి కథలకు సామెత లేర్పడినవి.

ఉదా :— గాలీ, వానా వస్తే, కథే ఆగిపోతుంది.

కంసాలినిఁజూచి, కథచెప్పు.

జీలకఱ్ఱ, సింగినాదము.
లోని గుట్టు పెరుమాళ్ళ కెఱుక.

ఈ సామెత లొక్కొక్క కథను గురించి చెప్పఁబడు చున్నవి.

లోకోక్తులలో ఛందస్సు, యతిప్రాసలు, శబ్దాలంకారములు, అంత్యప్రాసలు — ఒక్కొక్క నియమముతో నుండును.

ఉదా :— "ఉఱిమిన మేఘము, తఱిమిన పాము కుఱవక, కఱవక విడువవు".

"మదుంవార మడియైనా కావలెను, మాటకారి మగడైనా కావలెను."

"కళ్యాణము వచ్చినా కక్కు వచ్చినా ఆగవు."

"దరిలేని బావి, వితరణలేని కీవి."

"సరిలేని తగవు, హాస్యములేని నగవు."

ఈ లోకోక్తులలో సుకరప్రాసలు అంత్యప్రాసలు క్రమాలంకారములు, శబ్దాలంకారములు, పదలాలిత్యము భావ గాంభీర్యములు వినుకెంతో యింపుగా నున్నవికదా.

"ఐన వారి కాకులలోను, కాని వారికి కంచా లోను."

"అప్పు దొరికినప్పుడే పప్పొకూడు."

"గతిలేనమ్మకు గంజేపానకం."

"మబ్బు విడిచిన యెండ, మగని విడిచిన ముండ
పట్టి విడిచిన మండ పటాటోపాలు మెండు"

వీట్లలోని అందచందములు, ఛంధోనియమములు, యతులు, అంత్యానియమములు ఎంత సొగసుగా నున్ననో! అందుచేతనే "దేశభాషలందు తెలుఁగు లెస్స" అని తెలుఁగు భాషామతల్లి ప్రశంసలఁ గొన్నది.

సామెతలలో మానవ జీవితచ్ఛాయ లుండును.

మానవ జీవితములోగల విషయములకు, సంబంధించిన ఆరోక్త్యు లనేకములు గలవు.

ఉదా :- "సముద్రము యీదవచ్చునుగాని, సంసార మీద లేము."

"తా నొకటి తలిస్తే, దైవమొకటి తలఁచును."

"ఆపదలు కాపురము లుండునా ?"

ఇటువంటివి మానవజీవితములోఁ గల కష్టములను,

"రొట్టె విరిగి నేతిలో పడినట్టు"

"పట్టిందల్లా బంగారము"

ఇటువంటివి మానవజీవితములోఁ గల సుఖములను,

"పుట్టించిన వాఁడు పూరిమేపునా ?"

"ఓపిక పట్టితే, ఓరుగల్లు పట్నమౌతుంది."

"కలిమి లేములు, కావడికుండలు."

ఇటువంటివి మానవజీవితములోఁ గల ఓదార్యులను సూత్రీకరించుచుండును.

సామెతలలో నీతు లుండును.

పెద్దలు తమ అనుభవములను, పిన్నలకు హితోపదేశముగా చెప్పిన నీతులే సామెతలుగా నిల్చియున్నవి. యివి మానవ నడవడికకు మార్గములుగా నుండును.

ఉదా :–"పగటిమాటలుపనిచేటు–రాత్రిమాటలునిద్రచేటు"
"అంత్యనిష్ఠురముకన్న, ఆది నిష్ఠురముమిన్న"
"దాసరి తప్పులు, దండముతో సరి"
"అప్పులున్న వానితోను, చెప్పులున్న వానితోను పోకూడదు.

సామెతలలో కుటుంబ అనుభవము లుండును.

ఉదా :– "తేవలేని మొగఁడా! బాగళ్ళు చేయించు" అంటే
"బ్రతకనీవే పెళ్లామా! బావిళీలు చేయిస్తాను" అన్నాడట.
"దెసకొలఁది దొరికాడు, దిసమొల మొగుఁడు"
"ఆసత్తకు బోసత్త, బోసత్తకు బోడి మొగుఁడు"
"అత్త లేని కోడ లుత్తమురాలు, కోడలు లే నత్త గుణవంతురాలు"
"కోడలు నలుపైతే, కులమంతా నలుపే"
"తల్లి చాలు పిల్లకు తప్పుతుందా?"

ఇటువంటి సామెతలు వందలాదిగా గలవు. అనేక శీర్షి కలక్రింద విభజించి వివరించి, వ్రాసినచో యెంతేని లాభము గలదు.

ఇవి మామూలు సామెతలు. మనకు ప్రధానమైనవి వ్యవసాయ సామెతలుకదా!

నేను 1926 సం॥ నుండి సేకరించిన. వందలాది వ్యవసాయ సామెతలు నా కవిలె కట్టలలోబడియుండి శిధిలప్రాయములై పోవుచుండగా మిత్రులు శ్రీ మహీధర జగన్మోహనరావుగారు తమ విశ్వసాహిత్యమాలలో ప్రచురించెదమని నన్ను ప్రోత్సహించిరి. వారి ప్రోత్సాహమే లేనిచో యివి యెప్పటికైన యీ రూపములో బైట పడెడివో లేదో చెప్పజాలను. ఆంధ్రభాషాసేవ గావించుటలో విశ్వసాహిత్యమాల యింకను ముందంజ వేయగలదని ఆశించుచు యింతతో సెలవు దీసికొందును.

రాజమండ్రి,
30-8-1956.

నేదునూరి గంగాధరం.
సంకలనకర్త.

——✶——

# విషయసూచిక

# వ్యవసాయ సామెతలు



1. "అంబటేరు వచ్చింది, అత్తా!" అంటే "కొలబుర్ర నా చేతిలోనేవుంది, కోడలా!" అన్నదట.
2. అకాలపు వాన, ఆరికలకూడు.
3. అచ్చివచ్చిన భూమి అడుగుడే చాలు.
4. అడవిపంది మేసిపోతే ఊరబంది చెవులు కోసినట్లు.
5. అడుగడుగునా నిక్షేపం.
6. అడుగులోనే అరక విరిగిందట.
7. అడుగున ఎరువు కొద్ది పైన బంగారం.
8. అత్త ఏలిన కోడలూ, చిత్త పట్టిన చేనూ.

(బాగా ఉంటాయి)

9. అతివృష్టి అనావృష్టి.
10. అదును తప్పిన పైరూ, ముదిమిలో బిడ్డలూ ఒకటే.
11. అదునులో పొదలో చల్లినా పండుతుంది.
12. అదును కాని పదును.
13. అదు నెరిగి సేద్యం, పదు నెరిగి పైరూ.
14. అదునున్నూ, పదునునూ చెరచునది వేపనాగలి.
15. అదును లేనప్పుడు పదు నైతే నేమి?
16. అదునూ పదునూ కనిపెట్టి చల్లాలి.

17. అదునో పదునో అన్నారు.
18. అద్దెకు వచ్చిన గుర్రాలు అగడ్తలు దాటునా?
19. అన్నమదం వల్లనే అన్నిమదములూను.
20. అన్నీ పండించే కాపుకి అన్నమే కరువు.
21. అన్ని కార్తులూ తప్పినా, హస్త తప్పదు.
22. అన్ని రోగాలకీ వాతలువేసే వైద్యుణ్ణి అవతలుంచు.
23. అనుమూ లేదు, మినుమూ లేదు.
24. అనూరాధ కార్తెలో అనాధ కర్రయినా ఈనుతుంది.
25. అనూరాధ కురిస్తే మనోరోగాలు పోతాయి.
26. అనూరాధలో అడిగినంత పంట.
27. అమ్మగా మిగిలిన మేక.
28. అమ్మబోతే అడవి, కొనబోతే కొరివి.
29. అయిదునాళ్లూ పైచాలే తోలినట్లు.
30. అయితే ఆరిక, కాకుంటే కంది.
31. అయితే ఆరిక, కాకుంటే కంది, దున్ని చల్లితే సెనగ.
32. అరక అరిగిన గరిసె విరుగును.
33. అర్లుగొడ్డు పితుకునా?
34. అవ్వా కావాలి, బువ్వా కావాలి.
35. అశ్వని కురిస్తే అంతా నష్టం.
36. అశ్వని కురిస్తే అడుగు తడవదు.

37. అశోకుని రాజ్యంలో పశువైతే నేమి ?
38. ఆ కంపా యీ కంపా ఒక తోడుగు.
39. ఆకాశంలో గొర్రె ద్రొక్కుడు అతిసమీపంలో వర్షం.
40. ఆకుసత్తువ ఉంటే అడుగు పడుతుంది.
41. "ఆగడపలు వేసినవి అత్తా!" అంటే "అట్లకి బియ్యం నానబొయ్యి కోడలా!" అందట.
42. "ఆగడపలు, అత్తా!" అంటే "చారెడు వెనక్కి తీయవే, కోడలా!" అన్నదట.

(రాబోయే కాటకమునకు జాగ్రత పడుటకు పొదుపుచేయుట యని అర్థము)

43. ఆగడప వేస్తే అవశ్యం కురుస్తుంది.
44. ఆ గొడ్డు మంచిదైతే ఆ ఊళ్ళోనే అమ్ముడుబోను.
45. ఆ బుర్రలో విత్తనాలే !
46. ఆముదపు విత్తులు ముత్యాలవుతాయా ?
47. ఆరాటపు కదుదు ఏ రాటాన బెట్టినా బరబరే.
48. ఆరికకు చిత్త గండం, ఆడదానికి పిల్ల గండం.
49. ఆరిక కోస్తే యిల్లంతా గింజలు, దంచితే దొడ్డంతా పొట్టు.
50. ఆరిక చల్లిన రెడ్డికి ఆలుమగల కొకటే చీర.
51. ఆరిక కోసిన చేత్తోనే కందిని కోసినట్లు.

52. ఆరుద్రలో అడ్డెడు చల్లినా పుట్టెడు పంట.

53. ఆరుద్రలో విత్తనాలకీ, అన్నమిడిన యింటికీ సేగిలేదు.

54. ఆరుద్ర మొదటిపాదాన విత్తుతే ఆరంభములు చెడుతవి.

55. ఆరుద్రతో అదును సరి.

56. ఆరుద్రలో వేసిన ఆరిక ఆకులో పెట్టిన అన్నమే.

57. ఆరుద్ర బిందిస్తే అరవై రోజులు వరుప.

58. ఆరుద్ర వానలకి ఆమ్లములు ఫలిస్తాయి.

59. ఆరుద్ర ఉరిమితే ఆరువానలు పడతాయి.

60. ఆరుద్రవాన అదునువాన.

61. ఆరుద్ర కురిస్తే దారిద్ర్యం ఉండదు.

62. ఆరుద్ర కురిస్తే అందరికీ నయమే.

63. ఆరుద్రలో కురిస్తే ఆరు కార్తెలూ కురుస్తాయి.

64. ఆరు కొత్తెనలు; నూరు నీళ్ళు. (అరటి)

65. ఆలు కుదురూ చేను కుదురూ ఆనందం.

66. ఆలూ లేదు, చూలూ లేదు.

67. ఆలు లేత, నారు ముదర అవాలి.

68. ఆలుమగల కలహం, ఆరికకూడు వంట.

(శీఘ్రముగానే ముగుస్తాయన్నమాట)

69. ఆళ్ళు కొత్తవైతే తిరగళ్ళు కొత్తవా?

69. ఆవగింజ అట్టే దాచి, గుమ్మడికాయ కుప్పమీాద వేసే వాడు.

70. ఆవతిన్న పసరంలాగున.

71. ఆవాలుముద్ద చేసినట్లు.

72. ఆవు చేలోమేస్తే దూడ గట్టున మేస్తుందా ?

73. ఆవుల సాధుత్వం, బ్రాహ్మణుల పేదరికము.

74. ఆవుండగా గాడిదపాలు పితికినట్లు.

75. ఆవుపాడి యెన్నాళ్ళు, ఐశ్వర్యమెన్నాళ్ళు ? బర్రెపాడి యెన్నాళ్ళు, భాగ్యమెన్నాళ్ళు ?

౧. ఆవు పొదుగులోనే అరవై ఆరు పిండివంటలూ.

77. ఆవులు పోట్లాడి లేగల కాళ్లు విరుగద్రొక్కినట్లు.

78. ఆవు తొలిచూలు, బర్రె మలిచూలు,

79. ఆవూ దూడా ఉండగా మధ్య గుంజ ఆర్చిందట.

80. ఆశపడి వెల్లుల్లితిన్నా రోగం అల్లాగే ఉందట.

81. ఆశ్లేష కురిస్తే ఆరోగ్యం.

82. ఆశ్లేషవాన అరికాలు తేమ.

83. ఆశ్లేష కురిస్తే ముసలియెద్దూ రంకెవేస్తుంది.

84. ఆశ్లేష అడుగున కొక చినుకైనా అడిగినన్ని వడ్లు.

85. ఆశ్లేషలో ఊడిస్తే అడిగినంత పంట.

86. ఆశ్లేషలో ఊాచిన అంతులేని పంట.

102. "ఉడకవే ఉడకవే ఓ కూడా! ఉగాదిదాకా" అంటే "నాకేం పనిలేదు ఏరువాకాదాకా" అన్నట్లు.

103. ఉడిగి ఉత్తరం చేరుతుంది.

104. ఉత్తర ఉరుములు తప్పినా, రాజు మాడితప్పినా, చెదలకు రెక్కలు వచ్చినా కష్టం

105. ఉత్తరాన ఉరిమినా, పాము తరిమినా కురవక, కరవక విడువదు.

106. ఉత్తర ఉరిమి కురిసినా, పాము తరిమి కరచినా తిరగదు.

107. ఉత్తర చూచి ఎత్తరగంప.

108. ఉత్తరపదును, ఉలవకు అదును.

109, ఉత్తరలో విత్తుతే, ఊదుకొని తినడానికి లేదు.

110, ఉత్తరలో చల్లినపైరు, కత్తెరలో నరికిన కొయ్య.

111. ఉత్తర హస్తలు వృష్టికి ప్రమాణం.

112. ఉత్తర కార్తెలో చల్లితే ఊల తగులుతుంది.

113. ఉత్తగొడ్డుకు అరుపులు మెండు.

114. ఉత్తర వెళ్ళేక వరి ఊడ్పులా?

(కూడదని అర్థం)

115. ఉద్దగిరి గాలి తిరిగితే గుంటలు పట్టిపోవా?

116. ఉన్నది మనిషికి పుష్టి, తిన్నది పశువుకి పుష్టి.

117. ఉప్పాతో తొమ్మిదివున్నా శనివారపు జడికీశమ్పంపెరగదు.

118. ఉప్పుపల్లు పండితే వరిపంట యెక్కువ.

119. ఉమ్మడిగొర్రె పుచ్చి చచ్చిందట.

120. ఉరిమితే వాన కురియక మానదు.

121. ఉరుములు మెరుపులు చూస్తేనే ఉల్లాసమా?

122. ఉలవలు మూలజ్యేష్ఠల్లో విత్తినట్లు (పంటబాగు)

123. ఉల్లి ఉంటే మల్లె వంటలక్కే.

124. ఉల్లి చేసిన మేలు తల్లైనా చేయదు.

125. ఉల్లిని ముట్టనిదే వాసన వస్తుందా?

126. ఉల్లి పండినా, మల్లి పూచినా మంచినేలలోనే.

127. ఉల్లి పండిన నేల్లో మల్లి పూస్తుంది.

128. ఉల్లి పదితల్లుల పెట్టు.

129. ఉల్లిని నమ్మి, తల్లిని నమ్మి చెడినవాడు లేడు.

130. ఊటవేసిన మడి, వాతవేసిన పశువు.

131. ఊటనేల దుక్కికి వస్తుందా?

132. ఊడుపులు ఉద్ధరయినట్లు.

133. ఊదకూటిబలం, ఉద్యోగబలం. (అల్పకాలమే)

134. ఊదకూడెన్నాళ్ళు? ఉద్యోగమెన్నాళ్ళు?

135. ఊరంతా వడ్లు యెండబెట్టుకొనగా నక్క తోక యెండ బెట్టుకొందట.

136. ఊరిముందరి చేను ఐనా, ఉలవపొట్టు ఐనా, ఇంటిమని షైనా, బద్దపలుపై నా, బట్టకలిమికాడై నా మరో కొండ్ర మన్నతాము."

137. ఊరిపొలం, దూసరితీగ.

138. ఊరు విడిచినా ఉలవఅడుగు విడువరాదు.

139. ఊరుదరిపొలం, వాతలువేసిన పశువు, అక్కరకు వస్తాయి.

140. ఊల వేసిన మడిలో నీరుంటుందా ?

141. ఊసరక్షేత్రం, దూసరి తీగ.

142. ఊసరక్షేత్రంలో విత్తుతే ఉల్లికోపుల పంట !

143. ఊసరక్షేత్రంలోని పైరు, ఉదకంలేని చెరువు.

144. ఎంచివేస్తే, అరిక తరుగుతుందా ?

145. ఎంచిన ఎరువేదిరా ? అంటే యజమాని పాదమే.

146. ఎండబడితే ఉండబడుతుంది; ఉండబడితే వండబడుతుంది; వండబడితే తిండబడుతుంది; తిండబడితే పండబడుతుంది.

147. ఎండమూారు పంట.

148. ఎండినవారికి యినుము తిండి. (లోహం తినాలి)

149. ఎండి ఏడుం పండడంకంటె మురిగి మూంతేడు పండడం మేలు.

150. ఎక్కడైనా బావకాని వంగతోట్లో కాదు.

151. ఎక్కడ మేసినా పేడ మన పెరట్లోనే వెయ్యాలి.
152. ఎక్కడపొర్లినా మన మందలో యీనితే దూడ మనదే.
153. ఎక్కడ పొర్లినా మన మందలో యీనితేసరి.
154. ఎక్కితే గుర్రపురౌతు, దిగితే కాలిబంటు.
155. ఎక్కువ వెల గొడ్డును, తక్కువ వెల గుడ్డను కొనరాదు.
156. ఎత్తుపడిన గొడ్డు పులికి జడుస్తుందా ?
157. ఎద్దంత కుప్ప ఏడుపుట్ల చోళ్ళు.
158. ఎద్దీనిన దన్న గాట కట్టివేయుమన్నట్లు.
159. ఎద్దీనినదన్న దూడను కట్టమన్నాడట.
160. ఎద్దుకు ఎనుబోతుకు లంకె వేసినట్లు.
161. ఎద్దు అడుగులో ఏడు గింజలు పడితే పంట పలచన.
162. ఎద్దు తన్నునని గుర్రంచాటున దాగినట్లు.
163. ఎద్దు నడిగి గంత కడతారా ?
164. ఎద్దుపుండు కాకికి నొప్పా ?
165. ఎద్దులాటి మనిషికంటె ఎద్దే మేలు.
166. ఎద్దు మోసినంత, గోనె పట్టినంత.
167. ఎద్దు వెంబడే త్రాళ్ళ్యాను.
168. ఎద్దు ఎండకులాగ, దున్న నీడకు లాగ.
169. ఎద్దులేని సేద్యం, చద్దిలేని పయనం.
170. ఎద్దులాం తిని, మొద్దులా నిద్రపోవడం.

171. ఎద్దుకేమి తెలుసు అటుకులరుచి ?

172. ఎద్దుమీదివాడు ఎప్పుడో గాని, ఎద్దు వెనకవాడు యిప్పుడే యిస్తాడు.

173. ఎన్ని ఎండలబెట్టిన అన్ని వరపులగును.

174. ఎనుబోతుపై వాన కురిసినట్లే.

175. ఎరుగని ఊళ్ళో ఎమ్మెలు చేస్తే ఏకులు నీ మొగడు వడుకుతాడా ?

176. ఎర్రనేల పంట, ఒకనాటి వంట.

177. ఎరువుంటే వెర్రివాడూ సేద్యగాడే.

178. ఎరువుబెట్టి దున్నాలి.

179. ఎరువుపెట్టిన పొలమూ, ఏలుబడి కోడలూ. (పనికివస్తాయి)

180. ఎరువులేని పైరు, పరువులేని రైతు.

181. ఎరువు సత్తువచేస్తే, వెన్ను తీస్తుంది.

182. ఎరువో, వెంపలో.

183. ఏగిలిచేస్తే ఏలనివానికైనా పండుతుంది.

184. ఏగిలి దున్నితే మాలకైనా పండుతుంది.

185. ఏటా ఒకదూడ ఎందుకుకాదు ?

186. ఏటియీతకు లంకమేతకు సరి.

187. ఏటేట చేను, ఏమి పండించను ? (కౌలుభూమి)

188. ఏటివద్దు చేను, చీటికి మాటికి శ్రేయం.

189. ఏట్లో వంకాయలు కాస్తవా? అంటే ఓం! అన్నట్లు.
190. ఏడవనేర్చిన వ్యవసాయము.
191. ఏడు ఎండల విత్తనాలు ఎంతవరకుకైనా ఆగుతాయి.
(ఇప్పుడు శాస్త్రపరిశోధనలో నిజమని ఋజువైనది)
192. ఏడు కురచలు చూచి ఎద్దును కొనాలి. [వట.
193. ఏడుస్తూ వ్యవసాయంచేస్తే కాడీమోకులూ కాలిపోయిన
194. ఏడుస్తూ ఏరువాకసాగితే, కాడీ మోకులు దొంగలెత్తుకు పోయారట.
195. ఏతాంపాటకి ఎదురుపాట లేదు.
196. ఏతాం పెట్టుగా
197. ఏనుగు నెక్కినవాడు ఊరకుక్కకి జడుస్తాడా?
198. ఏనుగుకి ఒకసీమ, గుర్రానికో ఊరు, బత్తెకొక బాసిస.
199. ఏనుగు పండినా గుర్రమంత.
200. ఏరుముందా? ఏకాదశిముందా?
201. ఏరుముందా? ఏరువాక పున్నమిముందా?
202. ఏలేవానికి ఎద్దుపోతేనేమి? కాచేవాడికి కన్నుపోతేనేమి?
203. ఒంటిఎద్దు సేద్యం, వరిగాలు నొప్పి.
204. ఒకనాటి అదును, ఏడాది బ్రతుకు.
205. ఒత్తు పొత్తును చెరుచు.
206. ఒత్తువాములు కోసుతుంది, పలచన పాతర్లు కోసుతుంది.
207. ఓటికుండలో వరదు పలికితే వచ్చేదేవాన.

208. ఓర్చిన పసరానికి తేటనీరు.

209. ఔషధానికీ అపథ్యానికీ చెల్లు, రోగం మిగులు.

210. కంకి ఎర్రనైతే కన్ను ఎర్రనౌతుంది.

211. కంచె వేసినదే కమతము.

212. కంచెయే చేనుమేసినట్లు.

213. కంచెలేని చేను, తల్లిలేని బిడ్డ.

214. కంది పండితే కరువు తీరుతుంది.

215. కంపతోడుగు ఈడ్చినట్లు.

216. కంపెనీ వ్యవసాయం ఖర్చుల కేసరి.

217. కట్టకొక కంకి లేస్తైన పుట్టికి ఏదుంతరుగు.

218. కడవేరు మిగిలినా గరిక చిగర్చకమానదు.

219. కడమడివాని కటారిపోటుకంటె మొగమడివాడి ఏకు
పోటు మేలు.

220. కత్తిమీదసాము కానివానికైనా తగదు

221. కత్తు కలిస్తే పొత్తు.

222. కత్తెరలో వాన, కనకం పంట.

223. కత్తెరపోటుకు కదల బారుతుంది.

224. కనుమకి కాకర, భోగికి పొట్ల.

225. కన్యలో చల్లితే ఊదుకుతినడానికీ ఉండదు.

226. కన్యలో చల్లితే కనుగుంటల్లోకీరావు.

కనుకొండ మొయిలు వేస్తే కానుకుపడి బియ్యం.
కనుమలమీద మొయిలు మేస్తే కళ్లముందర వాన.
కన్ను మెరసైనా, మిన్ను మెరసైనా నీరే.
230. కదురూ కవ్వం ఆడితే కరువుండదు.
కరువు మానప పంట, మిడతల మానుప మంట.
కరువుకి మామిళ్లు, కాలానికి నేరేళ్లు.
కరువులో అధికమాసము.
కరువు కాస్తయినా గాభరా లావు.
కర్కాటకము బిందిస్తే కాటకము బందు.
కర్కాటకము బిందిస్తే పశ్చాటకం పండును.
కర్కాటకము వర్షిస్తే కాడిమోకు తడవదు.
కళ్లు అరిగిన గాదెలు నిండును.
కళ్లు మన్నైతేనే కాపుబ్రతుకు.
240. కలిగినవాడు గాదెతీసేసరికి పేదవానిప్రాణం పోయింది.
కలివిపళ్లు పండితే కాలం తీరుతుంది.
కలుపుతీయనిమడి, దేవుడు లేనిగుడి.
కలుపుతీస్తేనే బలుపు.
కలుపుతీయనిపైరు కరవుచేయదు.
కలుపుతీయనివాడు కోతకోయడు.
కలుపుతీతకి తొల్లిక కావాలా?
కల్లు చట్టిలో పొడగువ్వపడితే వానరాకట.

కవిలిచెట్లు కాస్తే కాపువరిపండుతుంది.
కవిలిచెట్లు పండితే కాలముపాడు.
250. కవిలిచెట్లు పండితే కరువు తప్పదు.
కసవులేనిదే పశువులేదు; పశువులేనిదే పెంటలేదు; పెంటలేనిదే పంటలేదు.
కసవుంటేనే పశువు.
కసవే బసవన్న.
కాకి గూడు పెడితే కడపటి వర్షం.
కాచిన చెట్టుకే రాళ్ల దెబ్బలు.
కాటికిపోయినా కరణాన్ని నమ్మరాదు.
కాటిలో వున్నవి కాకులు తిన్నవి.
కాని చోట కంద్దైనా కాయదు.
కాని కాలానికి కర్రే పామవుతుంది.
260. కాని వేళకి కందులు గుగ్గిళ్లయినట్లు.
కానుగ నీడ, కన్నతల్లి నీడ.
కాపుజాడ, గొర్రెజాడ.
కాపుల కష్టమే భూపతి సంపద.
కాపులచదువు కాసులనష్టము.
కాపుతోనే కరువూ వచ్చిందట.
కాపువానికి, కందిగింజకు సత్యంలేదు.

కాపు బీదరికమే పంట బీదరికం.

కామధేనువూ కల్పవృక్షమూ.

కాయలోపత్తి కాయలోఉండగానే నీకు మూడుముళ్లు, నాకు మూడుముళ్ళు.

270. కార్తీకం కలకాశా, వైశాఖం పులకాశా.

"కార్తీకమాసానికి కదురంతవుంటినా మాఘమాసానికి నా మహిమ చూపుతా" (చిక్కుడు తీగ.)

కార్తీకమాసాన కడపలు కడుగ ప్రొద్దుండదు.

కార్తీకం తల్లి కాపాడాలి.

కార్తీక వర్షం, కర్ణుని యుద్ధం.

కార్తీక మాసంలో కడపటి వానలు.

కార్తీకమాసముకు కాకులు త్రొక్కుతాయి.

కార్తీక పున్నానికి కలకపంటలు.

కారుజొన్న మేసే కోడెకి కైలాసం కావాలా?

కార్తెముందు ఉరిమినా, కార్యంముందు వదరినా కార్యం చెడుతుంది.

280. కాలంలో విత్తనాలు కలలోనైనా పోయాలి.

కాలతన్నితే పెరిగేది పుచ్చకాయ, కుళ్ళేదిగుమ్మడికాయ.

కాలమెరిగి మన్ను.

కాలి గోర్జు పడినపుడు నీటిలో ఉంచకు.

కాలే కడుపుకి మండే గంజి.
కాసు గొడ్డుకు రూక బందె.
కీలెరిగి వాత వెయ్యాలి.
కుంచెడు గింజలు కూలికిపోతే తూమెడుగింజలు దూడలు తిన్నవట.
కుప్ప తగులబెట్టి పేలాలు ఏరుకునేవాడు.
290. కుప్పపీకేదొంగ పరకయేరుకునేవాణ్ణి బెదరించినట్లు.
కుజ్జులసేద్యం కూటికీరాదు.
కుమ్మెలో గొడ్డుపైరు వేయరాదు.
కూటికిగింజలులేక, కొరముట్లు లేక సేద్యం చెడ్డరోత.
కూతల ఆర్భాటమేగాని కుప్పలోగింజలులేవు.
కూలికివచ్చి పాలికిమాట్లాడినట్లు.
కూలి కూటికిరాదు, లేకి చేతికిరాదు.
కూలీలకు గొల్ల మధ్యాహ్నమైనదన్నట్లు.
కృత్తికపునర్వసులు సత్తువపంట.
కొండవాడు వంకాయకాల్చుకుతిన్నట్లు.
300. కొత్తనీటికి చేప ఎదురెక్కినట్లు.
కొత్తనీరువచ్చి పాతనీటినికొట్టుకుపోయినట్లు.
కొబ్బరిచెట్లకు కుడితిమిత్తి.
కొమ్ము మాడ కూలుస్తుంది.

కొట్టిలూ ఒక పంటేనా,
కొల్లేటిపంట కూటికేచాలదు.
కొల్లేటి వ్యవసాయం గొడ్డువినాశనం.
కోటివిద్యలూ కొండ్రలోపలనే.
కోటివిద్యలూ కూటికే.
కోటివిద్యలకంటె కోరుకొని పొలందున్నడం మేలు.
310. కోటివిద్యలు నేర్చినా కొలవనుకాదు.
కోడి అడుగులో కోటివర్ణాలభూమి.
కోడిరెక్క ఆరబెడితే గొప్పవర్షం.
కోతరోజుల్లో కొడవలిపట్టినట్లు.
కోతలన్నాళ్లూ కోతిబ్రతికింది; తరువాత బ్రతికిందేబ్రతుకు.
కోతల్లో కూడదీసుకుంటే కూటికి కొరతరాదు.
కోతల్లో కునికిపాట్లుపడి; కొత్తఅమావాస్యకి కొంపా
గోడీ అనుకున్నట్లు.
కోరుకొండ తీర్థానికి కోడిగ్రుడ్డంత. (మామిడి పిందెలు)
కోరుగింజలు కొంగులోకీరావు.
గంటెలు పండినయింట, కణుజుపడినయింట కరువులేదు.
320. గట్టుమీద మేఘంమేస్తే కళ్లముందరేవాన.
గడ్డగడ్డకు గ్రుక్కెడు నీళ్ళుత్రాగినా రైతేసేద్యం
చేయాలి.

గడ్డికోసం సేద్యమా?

గబ్బరీదు కార్తె వర్షాలకి దిబ్బలూ కనుగుతాయి.

గరికచేను, గాడిదపాలు.

గాడిద యేమెరుగు గంధపుపొడివాసన.

గాడిదపుండుకి బూడిదమందు.

గాదెక్రింది ఎలుక గాదెక్రిందనే బ్రతుకుతుంది.

గాలి ఉండగానే తూర్పారబోయాలి.

గాలికుంటు పశువును మందలోఉంచకు.

330. గాలిపాటు కలిమికి చేటు.

గాలికుంటు ఐతే కురము అంటాడు.

గ్రుడ్డివాడు, నడ్డివాడు, మామగారిను గూడి రేసి,
వంచనింతలేక వానవచ్చెనూ.

గుట్టం గ్రుడ్డిదైనా దాణాతప్పదు.

గూనిదున్నకంటె గ్రుడ్డిదున్న మంచిది.

గొంజిపండ్లుపండితే కూడపైరుపండును.

గొడారిబేరం గొడ్డుకులాభమా?

గోడుగుపై గోడుగు పిడుగుపై పిడుగు.

గొడ్డువాడు గొడ్డుకుపడిస్తే, గొడారి తోలుకు ఏడ్చేడు;

గొడ్లుకాచేవాణ్ని కొట్టనివాడు, గొర్రెలుకాచేవాణ్ని
తిట్టనివాడు లేడు.

340\. గొఱ్ఱె త్రొక్కినా చాలును.

గొఱ్ఱెలాగినచోటచోళ్లు, నోళ్లతిరిగినచోట ధాన్యం.

గొఱ్ఱె గ్రొవ్వితే గొల్లకే లాభము.

గొఱ్ఱెలు గుంపుగూడితే గొప్ప వర్షం.

గొఱ్ఱెలవెంటవడ్లాది, ఆవులవెంట ఆరేండ్లు.

గొఱ్ఱె మందకట్టడంకంటె లోతుగాదున్నడమే మేలు.

గొఱ్ఱెవంపు గాలితోలిన వానతప్పదు.

గోవులానందింప బోవుపాపములు.

గోవుల్లేని ఊళ్లో గొడ్డుగేదే శ్రీమహాలక్ష్మి.

గోవే తల్లి, ఎద్దే తండ్రి.

350\. చంద్రపరివేషం వర్షయోగం.

చద్దిలేనిపయనము, ఒంటియెద్దు సేద్యం.

చదువుకున్నవానికీ సేద్యగాడే అన్నం పెట్టాలి.

చదువుకున్నవానికంటె చాకలి మేలు.

చావులేనిచేను, లేవలేని ఆవు.

చామలుచల్లినచేను విడిచిపెట్టు.

చాలుపైచాలుదున్నితే చచ్చునేలైనాపండుతుంది.

చాలూ లేదు, మూలం లేదు.

చింతపండితే జీడిపండదు.

చిత్తస్వాతులు కురియకుంటే చీమకుకూడా నాంబ్రం.

360. చిత్తకురిస్తే చింతలుకాస్తాయి.

చిత్తచిత్తంవచ్చినచోట పడుతుంది.

చిత్తయెండకు పిట్టతల పగులుతుంది.

చిత్తస్వాతి సందుచినుకులు చాలా దట్టం

చిత్తలోచల్లితే చిత్తుగాపండును.

చిత్తకార్తెలో ఉలవచేను చిత్తు చిత్తుగా నాటుతుంది.

చిత్తలో చల్లితే చిట్టెడూ కావు. (?)

చిత్తస్వాతులు వర్షించకపోతే చిగురుటాకులూ మాడి
పోతాయి.

చిత్తజల్లు, స్వాతివాన.

చిత్తస్వాతులు జోడించికురిసిన

370. 'చిత్తచిత్తగించి, స్వాతిచల్లజేసి, విశాఖవిసరకుంటే,
అనూరాధలో అడిగినంత పండుతాను' అన్నదట.

( జొన్న చేను విషయము. )

చిత్తచిత్తగించి, స్వాతిదయజూచి, విశాఖవిసరికొట్టకుంటే
వీసానికి పుట్టెడు.,

చిత్తస్వాతిచినుకులు చాటినంతయిస్తాయి.

చిత్తస్వాతులు చిత్తగించి విశాఖఒక్కవిసురు విసరితే,
మొదలుతన్నితే యేడుగింజలురాలుతాను.

చిన్నపునర్వసుకార్తెలో చిట్టెడువిత్తితే గరిశెడగును.

చీమలు చెట్లెక్కితే భూములుపండుతాయి.

చెట్టులేనిచేను, చుట్టములేనిఊరు.

చెట్టుచెడుకాలానికి కుక్కమూతిపిందెలు.

చెట్టుముందా? విత్తుముందా?

చెట్లు అధికమైతే చెప్పినట్లువాన.

380. చెట్టుఅయి వంగనిది మ్రానై వంగునా?

చెడగొట్టిసెనగ, ఆముదాలు.

చెడ్డనేలైనా ఏకఖండం మంచిది.

చెడినచేను చెరుకులు రాజనాలు పండునా?

చెడినచేనుకు మూడు మంచెలా?

చెప్పకపోయినా చప్పిగొమ్ముల యెద్దునేగొన

చెఱుకుకు చెరువు సూలంగి.

చెఱుకా! బెల్లం పెట్టుమంటే పెట్టునా?

చెఱకుపండితే కోఅత లేదు.

చెఱకు వంకరైతే చేదుపుట్టదు.

390. చెఱువుఓడు, ఊరుపాడు.

చేతులోలేనిది చేలోకియెల్లావస్తుంది?

చేతులోదిలేత, చేలోదిముదర.

చేతులోగాని చేలోలేదు.

చేనికుదురు ఆలికుదురువుండాలి.

చేనిపంట చేరెడైనాచాలు.

చేనిపంట కొయ్యగానే చెపుతుంది.

చేనికిఎరువు, మడికిమండ.

చేలోచేను, జాగాలోజాగా కలిస్తేవదలకు.

చేనికిగట్టు, ఊరికికట్టుఉండాలి.

400. చేనుచేసిచెడలేదు, చెడ్డచేసిబ్రతుకలేదు.

చేనిలోకలుపు, వైద్యునిచేతిలోతళుకు.

చేలోపుట్టినమొక్కలు చేలోనేచచ్చినట్లు.

చేలోనిపొత్తు కళ్ళంతోనేసరి.

'చేలోప్రత్తి చేలోఉండగానే పోలికిమూడుపోగులు,
నాకు మూడుపోగులూ' అన్నట్లు.

చేసినవారికి చేసినంత మహాదేవా!

చొల్లంగితీర్థానికి చోడిగింజలంతేసి, ( మామిడి పిందెలు )

చోళ్లుచల్లితే జొన్నలుపండునా ?

చోళ్లువిసరేతిరుగలి జొన్నలువిసరునా ?

జననిని ధరణిని నమ్మినవారు చెడరు.

410. జనుములో పాముపోతే పాతికనష్టం.

జలము లేనిచోట జీవమే లేదు.

జానలు పండితే జొన్నలు పండుతాయి.

జానెడు దుక్కి మూరెడు ఎరువుకి సమానం.

జీతం అక్కర్లేకుండానే తోడేలు గొఱ్ఱెల్ని కాస్తానన్నదట.

జ్యేష్ఠ చెడకురియును, మూల ముదుగ కురియును.

జొన్న పెరిగితే జాడు, వరి పెరిగితే వడ్లు.

జొన్నకి యేడుమార్లు గుంటక తోలాలి.

జొన్నపంటకి మన్ను బలం కావాలి.

జోరీగల గొడ్డుకు గోరోజనం మెండు.

420. తంటాలుమారి గుర్రానికి తాటిపట్టె గౌరవము.

తండ్రి సేద్యం, కొడుకు వైద్యం, కూడు మధ్యం.

తడిసి ముప్పందుం ఐంది.

తరిమి చల్లితే తవ్వెడే.

తరి అంటే వరి అంటాడు.

తరి గొంతుకకు వురి.

తలకట్టంటూ ఉంటే యెల్లాంటి కొప్పైనా పెట్టచ్చు.

తల్లి బాలు పిల్లకు తప్పుతుందా ?

తల్లి దే వలపక్షము, ధరణి దే వలపక్షము.

తల్లిపాలు దూడే చెపుతుంది.

430. తల్లి పెంచగవలయు, ధరణి పెంచగవలయు, పెరవారు
యేరీతి పెంచగా గలరు ?

తల్లిముఖం చూడని బిడ్డ, వానముఖం చూడని పైరు.

తల్లిని చూచి పిల్లను, పాడిని చూచి బఱ్ఱెను పుచ్చుకో

తిరిగితే వరిపొలం, తిరగకపోతే అడవిపొలం.

తిరిగిరైతూ, తిరగక బైరాగీ చెడతారు.

తీగకు కాయలు బరువా?

తురకల సేద్యం పెరికెలపాలు.

తులలో వానకు ధరణి పండును.

తుళ్ళే యెద్దే గోనెలు మోసేది.

తువ్వన వేసిన యెరువు, బాపనికి పోసిన నెయ్యి.

440. తూనీగలాడితే తూమెడు వర్షం.

తూర్పున కొఱ్ఱువేస్తే దుక్కిటెద్దూ రంకె వేస్తుంది.

తూర్పున ఇంద్రధనస్సు దూరాన వర్షం.

తూర్పున యింద్రధనస్సు వేస్తే తుంగమడిలోనూ, పడమర యింద్రధనస్సు వేస్తే బండమీదనూ పశువుల్ని కట్టాలి.

'తూర్పున శెరవేసింది, తుంగభద్రలో దొడ్డిగట్టరా, గొల్లవాడా!' అన్నట్లు.

తెగినచేను తేమకోర్చును.

తెల్లపూలు పండితే తెల్లజొన్నలు, బలుసులు పండితే పచ్చజొన్నలు పండుతాయి.

తేర గుఱ్ఱానికి తంగేటి బరికె.

తొండకు వెలుగు సాక్షి.

తోత్తులా పాటుపడాలి, దొరలా తినాలి.

450. తొలకరిని చెరువునిండినా, తొలిచూలు కొడుకు పుట్టినా లాభం.

తొలకరివానలు మొలకలకు తల్లి

తొలి ఏకాదశికి తొలి తాటిపండు.

తోకవడ్లు పంట, వెన్నుకోత నేస్తం.

తోటకి వర్షం, దూడకి గడ్డి.

తోడేలును గొఱ్ఱెలకి కావలిపెట్టినట్లు.

దండి అమావాస్యకు వాన తాడు తెంచుకుపోతుంది.

దంపినమ్మకు బొక్కిందే కూలి.

దరిద్రుడు తల కడుగబోతే గాలీ వానా వచ్చిందట.

దక్షిణాన మబ్బుసాగితే వాన తప్పదు.

460. దక్షిణపుకొమ్ము హెచ్చు ధాన్యపుధర హెచ్చు, ఉత్తరపుకొమ్ము హెచ్చు ఉప్పుధర హెచ్చు.

(చంద్రవంక కొమ్ములను గూర్చి)

దాగబోయిన దయ్యాలు పట్టుకొన్నట్లు

దాపలా వలపలా.

దాయకట్టని ఆవు తన్నకమానదు.

దిబ్బాదిబ్బా దీపావళి, మళ్ళీవచ్చే నాగులచవితి, పుట్టామీద పట్టాకర్ర.

దీపావళికి దివ్వెంత పంట
దీపావళికి దీపమంత చలి.
దీపావళికి వర్షాలు ద్వీపాంతరాలు దాటుతాయి.
దుక్కివుంటే దిక్కువుంది.
దుక్కి కొద్దీపంట, బుద్ధి కొద్దీ సుఖము.
470. దుక్కిగల భూమి, దిక్కున్న పిల్లడూ చెడరు.
దుక్కి చలవేచలవ, తల్లిపాలే పాలు.
దుక్కి దున్నితే భూమికి శుభము.
దుక్కి సత్తువచేత దుగడంబులేదు, ఆకు సత్తువచేత
అడుగుపడును, ఎరువు సత్తువచేత వెన్నుతీను.
దున్నక వేసిన ఆముదాలు, మాదిగకిచ్చిన అప్పు.
దుక్కిటెద్దు దేశాంతరం వెళ్ళినట్లు.
దుక్కిలేని చేను, తాలింపులేని కూర.
దుక్కిలేని చేను యెరువెంతపెట్టినా వ్యర్థమే
దుక్కులైనాయి, పసరికమేపు.
దున్నకుండా చల్లితే కొయ్యకుండా పండుతాయి.
480. దున్నగలిగితేనే మన్ను ముట్టాలి.
దున్నపోతు ఈనినదన్న దూడను కట్టుమన్నాడుట.
దున్నపోతే దూడల్లోకీ, మేయబోతే యెడ్లల్లోకీ
దున్నపోతు ఈనినదంటే దూడను కుడిపితిరా ? అన్నాడు.

దున్ని ఉంచిన దొడ్డగపండు.
దున్నేరోజుల్లో దేశంమీదికిపోయి, కోతల కాలంలో కొడవలి పట్టినాడట.
దున్నేవాడు లెక్కచూస్తే నాగలీ మిగులదు.
దున్నేవానికే భూమి.
దున్నే యెద్దునే కొట్టేది.
దూడ ఉంటేనే పాడిపశువు పనికివచ్చేది.
490. దూడచస్తే కమ్మలం, ఎనుముచస్తే నిమ్మలం.
దూడలేని పాడి దుఃఖపు పాడి
దూడ కుడిచినట్లా? దుత్తలో పడినట్లా?
దూడపాలు దుత్తకే ఆయె.
దూడ కుడుచుకుంటేగాని దుత్త నానదు.
దూరం గుడికడితే దగ్గరలో వాన, దగ్గర గుడికడితే దూరాన వాన. (చంద్రపరివేషం)
దూస్తే దోసెడు, ఊదితే హుళక్కి అన్నట్లుంది సేద్యం.
దొడ్డెడు గొడ్లు దొంగలు తోలుకుపోతే గొడ్డుగేదె శ్రీ మహాలక్ష్మి ఐనదన్నట్లు.
దొమ్మరోగానికి కొర్రగంజి.
దొమ్మలన్నిటిలో మిడిదొమ్మ మిండడు.
500. దొరలిచ్చిన పాలుకన్న ధరణియిచ్చిన పాలు మేలు.

దోమలు పడితే చామలు పండుతాయి.

ధనియాల జాతి.

ధనలక్ష్మి ధాన్యలక్ష్మితో దీటుకాదు.

ధూళీ చైత్రం.

నక్కలు మరవలు పారితే కుక్కలు కూటినోళ్లవు.

నల్లేరుమీద బండి.

నాగలిఉన్న ఊర ఆకలి చేరదు.

నాగలి వదలితేనే నాగరీకం ముదురుతుంది.

నాటిన విత్తుకు నష్టంలేదు.

510. నానిన భూమి నవధాన్యాలు పండుతుంది.

నారు పోసినవాడు నీరు పోయడా ?

నారు, నీరు, నోరు ఉంటే ఏ రాజ్యంలోనున్నా ఒకటే.

నాలుగువైపుల కదుళ్లు కలిగిన నలభై రోజులకి కోత.

నిన్న కుప్ప, నేడు ఆళ్ళు.

నిమ్మకు నీరెత్తినట్లు.

నీరు పల్లమెరుగు.

నీరూ ఉండాలి, నారూ ఉండాలి.

నీరుంటే ఊరులేదు, ఊరుంటే నీరులేదు.

నీరులేని పైరు, నూనెలేని జుట్టు.

520. నువ్వు చస్తే బొబ్బర.

నువ్వుకి నూరు తెగుళ్ళు.

నువ్వులు పండినా, చోళ్ళు పండినా రైతు చెడడు.

నూవ్వులకు ఏడుదుక్కులు, ఉలవకు ఒకదుక్కి.

నూతిని రక్షిస్తే నిన్ను పోషిస్తుంది.

నూరయేవరకు కాపాడు, తరువాత నేనే నిన్ను కాపాడుతా (రూపాయిలు)

నేములు కాస్తే భూములు పండును.

నేరేళ్లు పండితే నేలలు పండును.

నేరేళ్లు నిగిడేది, మామిళ్లు మగ్గేది మంచి కాలానికి లక్షణం.

నేలను గొర్రె తొక్కనాచాలు.

530. నొచ్చినావాడా! నువ్వులు చల్లు!

పంటపెంటలో ఉంది, పాడి ఊరిలో ఉంది.

పండనినేల పండుంకంటే పండేనేల కుంచెడేచాలు.

పండించేవాడు పస్తుంటే పరమాత్మకూపస్తే.

పంట పైరులోనే తెలుస్తుంది.

పండుముతిన్నా పరగడుపే, ఏదుముతిన్నా ఏకాదశే.

పండుం తిన్నవాడే పది దుక్కులు దున్నగలడు.

పచ్చజొన్నపైరు; ఐతే ఆరిక లేకుంటే కంది.

పచ్చజొన్నపైరు; పైని గోంగూర.

పచ్చడం వెడల్పున పది కఱ్ఱలున్నా పైరు చెరుపకు.

540. పట్టిసంతీర్థానికి ప్రత్తిగింజలంత. (మామిడిపిందెలు)

పడమట మెరిస్తే పండైనా నీళ్లు త్రాగము.

పడమట పావురాపిట్టంత మేఘం పాతాళం బ్రద్దలు కొడుతుంది.

పడమట కొఱ్ఱువేస్తే పాడిఆవు రంకెవేస్తుంది.

పడమర మెరిసిన పది ఘడియలకు వాన.

పడమట కొఱ్ఱుపడితే పందిళ్ళమీద రాజనాలు పండుతవి.

పడమట పూరేడుపిట్టంత మొయిలు, బండలను దొర్లించే వాన.

పడుచుల సేద్యం పాకానికి రాదు.

పడుచులూ, పశువులూ ఉంటేనే వ్యవసాయం.

ప్రత్తికి పదిచాళ్ళూ, ఆముదాలకి ఆరు చాళ్ళూ.

550. ప్రత్తికి పది చాళ్ళూ, జొన్నకు యేడుచాళ్ళు.

ప్రత్తిపైరు, భాగ్యానికి రెండుకళ్ళు.

పది దుక్కులుమీద దున్నితే పాపాత్ముడు.

పది ఆషాడ వర్షంలో పరగడగుఱ్ఱం పరుగెత్తలేదు.

పదిమంది గలవానికే సేద్యము.

పదిమంది గలవాడు కొండైనా పండిస్తాడు.

పదును తప్పినా, అదును తప్పినా, పన్నులు దండుగ.

పన్నెండు (నెలల) లో రెండుపోతే అంతా పాడే.

పలకమ్మ పున్నానికి పడమటికొమ్మ పూస్తుంది.

(మార్గశిర పౌర్ణమి)

పలకమ్మ పున్నానికి పడుగులు బడతాయి.

560. పలుచన పాతళ్లు కోరుతుంది. ఒత్తువాములు కోరుతుంది.

పలుచన పంటవేడుక, ఒత్తు చూడవేడుక.

పల్లం దున్నినవాడు పల్లకి యెక్కినవాడే.

పలకమ్మ పున్నం గడిస్తే తల్లిలో కలుస్తాను.

పల్లెటూరికి పది దారులు.

పశువుల ఎరువు పంటకు బాట.

పశువులనుబట్టే పెంట, పెంటనుబట్టే పంట.

పశువుకు తిన్నది పుష్టి, మనిషికి వున్నది పుష్టి.

పశువులు కాచేవాడు పాటుకి పనికిరాడు.

పశువులో పాలు నోటిలో వున్నాయి.

570. పశువుపాలు కసవునుబట్టే.

పాతనీరు, మేకపాడి రోత.

పాటిమీది వ్యవసాయం కూటికైనా రాదు.

పాడిగుట్టు, పంటరట్టు.

పాడికి పంట తమ్ముడు.

పాడిగొడ్డును, పసిబిడ్డను భద్రంగా చూడాలి.

పాన్పు సెబ్బరైతే పసరాసికీ సెబ్బరే.
పాన్పు చూచి పసరాన్ని కట్టు.
పాపడము పది చేలపెట్టు.
పాపడము పది సేద్యాలపెట్టు.
580. పాలు చిక్కనైతే వెన్న వెక్కసము.
పాలు చూడనా, భాండాన్ని చూడనా.
పాలేరు దున్నిన పరగ నప్పులపాలె.
పాలేరువానికి గొడ్డుపోయినా, సవతి తల్లికి బిడ్డపోయినా దిగులు లేదు.
పార్సీవారికి వృషభమూత్రమే పవిత్రము.
పిండికొద్దీ రొట్టె, తిండికొద్దీ గొడ్డు, పెంటకొద్దీ పంట.
పిట్టకొంచెం, కూతఘనము.
పుచ్చిన విత్తులు చచ్చినా మొలవవు.
పుట్టమన్ను వేస్తే భూమిఫలిస్తుంది.
పుణ్యానికి పుట్టెడిస్తే, పిచ్చుకుంచమని పీకులాడినట్టు.
590. పుట్టించినవాడు పూరిమేపడు.
పునర్వసు పుష్యములు వర్షిస్తే, పూరేడుపిట్ట అడుగైనా తడవదు.
పుష్యమికి పూత, అమావాస్యకు ఆరగింపు. (తేనెపట్టు)
పుబ్బలో పుట్టెడు చల్లడంకంటె మఖలో మానెడు చల్లుట మేలు.

పుబ్బలో చల్లడం దిబ్బమీద చల్లడమే.

పుబ్బలో విత్తుటకంటె ఊరుకొనుట మేలు.

పుబ్బలో చల్లేది, మబ్బుతో మొత్తుకునేది.

పుబ్బలో పుట్టెడుకంటె ఆశ్లేషలో అడ్డెడేచాలు.

పుబ్బ ఉబ్బిబ్బి కురిసినా గొబ్బిచెట్టుక్రింద తడవదు.

పుబ్బ కెరలితే భూతం కెరలినట్లే.

600. పుబ్బ రేగినా, భూతాలు రేగినా పారం ముడుతుంది.

పుబ్బలో చల్లినా, బూడిదలో చల్లినా ఒకటే.

పుష్యమాసంలో పూసలుగ్రుచ్చ ప్రొద్దుండదు.

పుష్యంలో కురిసే పూరిపుల్లయినా తడవదు.

పుష్యమాసానికి పూసంత వేసంగి.

పూచిన పువ్వులన్నీ కాయలైతే పుడమిమీద చోటేది ?

పూచేటప్పటి పూవులే కాచేటప్పుడు కాయ లవుతాయి.

పూచిన తంగేడు వేసినా, కాచిన వెంపలి వేసినా.

పూచిన పూతజూచి పొంగి బోర్లపడరాదు.

పూచే పూతనుబట్టి కాచే కాపుండదు.

610. పూచింది పుడమంత, కాచింది గంపెడంత.

పూచింది ఒక మెత్తు, నోచింది ఒక మెత్తు.

పూజలన్నిటిలో గోపూజే గొప్పది.

'పూచిన తంగేడు వేసిరా ? కాచిన గానుగ వేసిరా ?
నేను పండేందుకు ?' అన్నదట చేను.

పెంటమీద పంట, మంటమీద వంట.

పెంటకుప్ప పెరిగితే పేదరైతు పెద్దవుతాడు.

పెట్టిందంతా పైరగునా? కన్నదంతా కాన్పగునా?

పెద్దవాడు, పడుచువాడు, మామతోడ గూడిరేని, వంచ నింత లేకుండ వాన వచ్చును.

పెద్దయింటి బొట్టైనా, పెద్దచెరువు నీరైనా కావాలి.

పెద్దయింటి బొట్టె, యెద్దులున్న వ్యవసాయం విలువే.

620. పెన్నవస్తే వెన్న కరిగేలోపలే.

పెన్నదాటితే పెరుమాళ్ళ సేవ.

పెరటిచెట్టు మందుకురాదు.

పెరుగుట విరుగుట కొరకే.

పెసరకు తూర్పు.(పైరు) గాలి, పసరానికి నోటిగాలి.

పైచాలులేని పైరు, పగటి అంబలిలేని మనిషి. (ఒకటే)

పైపెట్టుగ వర్షించినపైరు, పగవాని మొగము చూడ రాదు.

పైనబడ్డ మాట, మడినిబడ్డ నీరు వృథాకావు.

పైరు ముదురు, పసరం లేత.

పైరు పెట్టక చెడిపోవుటకంటె పెట్టి చెడుటమేలు.

630. పైరు మారిస్తేనే పంట పెంపు.

పైరుగాలి తగిలితే పంట ఉరవు.

పొంగే కాలానికి బలుసు, క్రుంగేకాలానికి మామిడి.
పొంగేపాలూ, వెలిగేదీపం ఆర్పరాదు.
పొట్టకు పుట్టెడు.
పొట్టలు తినేవానికి ఊచబియ్యమెట్లు వస్తుంది?
పొట్టకిచ్చినా, బట్టకిచ్చినా భూదేవే.
పొట్టేళ్ళ పోట్లాటలో నక్క చిక్కినట్లు.
పొదుగుకోసి పాలు త్రాగుదురా?
పొదుగు చింపిన పసరం పోతును యీనుతుంది.
640. పొదుపుగలవాడే అసలైన పొలముకాపు.
ప్రొద్దుట వచ్చినవాన, మధ్యాహ్నంవచ్చిన చుట్టం పోరు.
ప్రొద్దుట వచ్చిన చుట్టం, సాయంత్రం వచ్చినవాన నిలువరు.
ప్రొద్దుట లేవని కాపుకి పొలమిచ్చేది గడ్డే.
పొరుగూరి వ్యవసాయం, పొరుగూరి చాకిరీ తనను తినేవే గాని తాను తినేవిగావు.
పోట్లాడే కోళ్ళు బాదినా మానవు.
పోటీకి సాటిలేదు.
పోలినాటిలో పోకకు పుట్టెడు.
పోలేరమ్మ దిగివచ్చినా పొలంకాపుకేంభయం?
బండీ యెద్లూ అమ్మినవాని బ్రతుకు బందీ.
650. బందరు మూలమెరిస్తే బక్క యెద్దును అమ్మిస్తుంది.

బడితె కలవానిదే బఱ్ఱె.

బడిలేనిచదువు, వెంబడిలేని సేద్యం కూడదు.

బరక సేద్యం, తురక నేస్తం కూడవు.

బరిగపంట, కడుపు మంట.

బఱ్ఱె చస్తే పాడి బైట పడుతుంది.

బలుసులు పండితే గొలుసుల్లా కంకులు.

బలుసులు పండితే పచ్చజొన్నలూ పండుతాయి.

బాపనసేద్యం బడుగుల నష్టం.

బాపనసేద్యం, బాలవైద్యం.

660. బాపనసేద్యం భత్యంచేటు.

బాపలు తప్పినా వేపలు తప్పవు.

బాపల వ్యవసాయం, కాపుల సమారాధన.

బాపనసేద్యం బ్రతకడానికీకాదు, బ్రతికించడానికీకాదు.

బావిలోని కప్ప రాచకార్యాలు మాట్లాడినట్లు.

బావిక్రింద మన్ని బ్రతికినవాడు, చేనిక్రింద దున్ని చెడిన వాడు లేడు.

బాపడు ఒంటిపూటపడ్డా, బఱ్ఱె ఒంటిపూటపడ్డా మానెడు.

బీటిని కురిసిన వర్షం, అడవిని కాచిన వెన్నెల.

బుధవారం పుట్టిన దున్న భూమిని దున్నినా, త్రొక్కినా, పొంగిపొంగి పండుతుంది.

బెల్లపు పొయ్యికి యీగలే నిదర్శనం.

670. బెల్లం వండిన పొయ్యి.

బొచ్చు కాలిస్తే బొగ్గులవుతుందా ?

బోడెద్దుకు పోట్లు నేర్పినట్లు.

బోడెద్దుకు కొమ్ములు వచ్చినట్లు.

బోదనము కోడితే రాజనము పండును.

భరణికార్తెలో చల్లిన కాయకు చిప్పెడు పంట.

భరణికార్తెలో బొండలకు బండలు పగులుతాయి.

భరణికురిస్తే ధరణి పండును.

భరణికార్తెలో నువ్వులు చల్లితే కాయకు బరిగెడు గింజలు.

భావాయ పున్నమికి పరగళ్లు పచ్చపడతాయి.

680. మంగళగిరిమూల మాడంతమబ్బు పడితే, ఈ మని జంపనుల్లో ఈతల మోపులు.

మంగళవారం మండె వేయరాదు.

మంచిమన్ను, మందమెద్దు సమం కాదు.

మంచిగొడ్డుకొక దెబ్బ, మంచిమనిషికొక మాట.

మంచి కాలానికి మామిళ్ళు, చెడుకాలానికి చింతలు.

మంది ఎక్కువైతే మజ్జిగ పలచన.

మఖకు మానికంత మొక్కయితే కార్తీకానికి కడవంత కాయ. (గుమ్మడి)

మఖపుబ్బలు అరుపైతే మహాక్షామము.

మఖపుబ్బలు ఒరుపైతే మా అన్నసేద్యం, మా సేద్యం మన్నే

మఖపుబ్బలు వరుపిస్తే మహాభయం.

690. మఖ ఉరిమితే మదుకుమీాది కర్రయినా పండును.

మఖలో చల్లిన విత్తనాలు మచ్చలు కనబడతాయి.

మఖలో పుట్టి పుబ్బలో మాడినట్లు.

మఖలో మానెడు చల్లుటకన్న ఆశ్లేషలో అడ్డెడు మేలు.

మఖలో మానెడు, పుబ్బలో పుట్టెడు.

మఖ వానల ఋతువు.

మఖా పంచకం సదా వంచకం.

మట్టిగడ్డలో కప్పకూస్తే ఘాములో వర్షం.

మడికి మంది, చేనుకు ఎరువు.

మడికి గట్టు, ఇంటికి గుట్టు.

700. మడిదున్ని మహారాజైనవాడు, చేనుదున్ని చెడినవాడు లేడు.

మడి బీద, రైతు పేద.

మదుంవార మడిఐనా కావాలె, మాటకారి మగడైనా కావలె.

మనిషికి ఉన్నది పుష్టి, పశువుకి తిన్నది పుష్టి.

మన్నును నమ్మి దున్నినవాడే మన్నీడు.

మన్ను మగ్గితే మూలకైనా పండును.

మన్ను మిన్ను మెత్తబడితేనే మనుష్యులకి బ్రతుకు.

మన్ను వెళ్ళకుండా దున్నితే, వెన్ను వెళ్ళకుండా పండు
తుంది.

మబ్బు విడిచిన యెండ, మగడు విడిచిన ముండ.

మలపగేదె మానెడు, (పాలు యిచ్చును)

710. మలుగుట క్రుంగితే మాపటికి యీనుతుంది.

మహాలక్ష్మమ్మ పండుగకు మాడెత్తు చలి.

మహారాజుకైనా మన్ను నమ్మినవాడే అన్నం పెట్టాలి.

మాగిలి దున్నితే మూలనికైనా పండును.

మాగిలి దున్నితే మరింత పంట.

మాఘమాసంలో మడురుమీాది గడ్డి ఎండుతుంది.

మాఘమాసంలో మ్రాకులూ వణుకును. (చలికి)

మాఘమాసంలో మంటలో పడినా తీరదు. (చలి)

మాఘమాసపు వాన, మొగుడులేని చాన.

మాటలు గొప్ప, మానిక పిచ్చ.

720. మాదలన్నిట్లో కొమ్ముమాద. (ప్రమాదకరం)

మామిళ్లు మ్రగ్గినా, నేరేళ్లు నిగిడినా ఫలం గొప్పది.

మామిళ్లు మ్రగ్గితే సజ్జలు పండుతాయి.

మామిళ్ళకు మంచు చెరుపు.

మామిళ్లు కాస్తే మశూచికాలు మెండు.

మార్గశిరాన మహాంతమైన చలి.

మార్గశిరాన మామిడిపూత.

మార్గశిరంలో మాట్లాడ ప్రొద్దుండదు.

మాలపున్నం ముందు మాదిగైనా చల్లడు.

మ్రానిపండ్లు మ్రానిక్రిందనే.

730. మిగులు నూవులు మృగశిరలో చల్లు.

మిథునంలో మొలచిన మొక్క, మీసకట్టున పుట్టిన కొడుకు అక్కరకు వస్తారు.

మిన్ను ఎర్రనైనా, కన్ను ఎర్రనైనా కారకమానదు.

మిరపనారు, కురుంబగొర్రె వెన్నుమీద కత్తిరించాలి.

ముంతెడు పాలకు ముత్యమంత వెన్న.

ముందువేసిన పైరు, ముందుకలిగిన బిడ్డ.

ముందు అరకకు మొనగాళ్ళను కట్టరా!

ముందు దున్నినవాడే రైతు, ముందు నడిచినవాడే నాయకుడు.

ముదిమిని పుట్టిన బిడ్డలు.

ముక్కుతాడులేని గిత్త, ముండ పెంచిన బిడ్డ.

740. ముడిబియ్యం తింటే ముప్పు గడుస్తుంది.

ముత్యమంత పదునుంటే మూలకార్తెలో చల్లిన ఉలవ
చేను కాస్తుంది.

ములగచెట్టూ ఒక చెట్టే ?

ముషిణి చెట్టైనా పచ్చనిచెట్టు కొట్టరాదు.

మూల ముఱుగకురియు, జ్యేష్ఠ చెడకురియు.

మూలముంచును, జ్యేష్ఠ తేల్చును.

మూలవాన ముంచక వదలదు.

మూల కురిస్తే చాలా చెరుపు.

మూలకార్తెకు వరిసస్యం మూల చేరుతుంది.

మూల కురిస్తే ముంగారి పాడు.

750. మూలలో చల్లిన ఉలవలు మూడు పువ్వులు ఆరు
కాయలు.

మృగశిరకు ముంగిళ్లు చల్లబడతాయి.

మృగశిర కురిస్తే ముసలెద్దు రంకెవేస్తుంది.

మృగశిర చిందిస్తే మిగిలిన కార్తెలూ కురుస్తాయి

మృగశిర వర్షిస్తే మఖ గర్జిస్తుంది.

మృగశిర కురిస్తే ముంగారి పండుతుంది.

మృగశిరలో మొక్క, మీసకట్టున కొడుకు కలగాలి.

మెట్టరైతు, లొట్టిపిట్ట.

మెట్ట దున్నినవాడు, లొట్టి త్రాగినవాడు ఒకటి.

మేక యెంతబలిసినా తోక బెత్తెడే.

760. మేఘాన్ని నమ్మి, చెరువుకట్ట తెగ్గొడుతారా?

మేఘాలు కురిస్తేనే మేడలూ మిద్దెలూనూ

మేడి సిరి కీడు నిడను.

మేతలన్నిట్లోకీ బీటిమేత.

మేదరసాల దుర్గంమీద మేకకాలంత మొయిలు మేస్తే,
తుళ్లూరు, దొండపాడుకాస్తే దూడ కట్టయినకాదు.

మేహ జాడ్యం, తోలు సేద్యం.

మొండితోకగొడ్డు రాగోరును, గ్రుడ్డి గొడ్డు పోగోరును.

మొక్కజొన్నకండె మొదలు, పొగాకు ఆకుచివర.

మొదట మానెడు, దూడచస్తే దుత్తెడు.

మొదలు మోదుగలు వేస్తే, కొసలు సంపెంగలు
పూయునా?

770. మోదుగ ఫలిస్తే మొదటిపంట.

మోసేవాడికి తెలును కావడి బరువు.

యముడు ఒకణ్ణి చంపితే ఏతాం ముగ్గుర్ని చంపుతుంది.

రాజరాజులకి రాజదండం, కాపుకి కరుకోల.

రాళ్ళచేనుకి గుంటక తోలినట్లు.

రాజులేని రాజ్యం, కాపులేని గ్రామం లేవు.

రాచవారి భోగం రైతుల త్యాగం

రూక లేనివాడు పోకచేయడు.
రెంటికీ చెడిన రేవడ.
రెండూళ్ళ వ్యవసాయం, యిద్దరు భార్యలు.
780. రెండేళ్ళ యెండు, మూడేళ్ళ మురుగు ఉండదు.
రెడ్లలో తెగలకు, వడ్లలో తెగలకు లెక్కలేదు.
రేగడ భూమిని, (పేద) రాజును చే విడువకు.
రేచీకటి పశువును చీకట్లో ఉంచు.
రేవతి వర్షం అన్ని పంటలకూ రేణింపే.
రైతులకు క్షేమం, రాజులకు భాగ్యం.
రైతు పెరుగుతే రాజూ పెరుగుతాడు.
రోగాల్లో గురక (ప్రమాదకరం)
రోలు కరువు నెరుగదు.
రోహిణికార్తెలో విత్తుట రోటిలో విత్తుటే.
790 రోహిణీ విత్తనం రోళ్ళకైనా పండదు.
రోహిణీ మృగశిరలు వరపైతే రోళ్ళు పగిలే యెండ.
రోహిణి యెండకు రోళ్లు పగులుతాయి.
రాతు మెత్తనైతే గుఱ్ఱం మూడుకాళ్ళతో నడుస్తుంది.
లావులేని చేను, లేగలేని ఆవు.
వంకాయ తమ్ముడు వాకుడుకాయ.
వంగ ముదురు, వరి లేత. (మంచివి కావు)

వంశ మెరిగి వనితను, వన్నె ఎరిగి పశువును కొనాలి.

వచ్చేటప్పుడు ఉలవ, పోయేటప్పుడు నూవు.

వట్టిగొడ్డుకు అరవు లెక్కువ, వరపు చేటికి మెరుపులు మెండు.

800. వట్టిగొడ్డుకు అరుపు లెక్కువ, వాన లేని మబ్బుకు ఉఱుము లెక్కువ.

వట్టిమట్టి ఐతేనేమి ఉత్తినే వస్తుందా ?

వడ్ల రాశి వరదకుపోయినా వానకు కరువా ?

వడ్లూ గొడ్లూ వుంటేనే వ్యవసాయం.

వన్నెమాదిరే వన్నె పుడుతుంది.

వరికి వాక, దొరకు మూక.

వరిపట్టు కడితే గొప్ప వృష్టి.

వరికి పాలచవిటినేల.

వరిచేనుకి పొట్టకి పుట్టెడు నీరు.

వరపుకి మెరుపులు మెండు.

810. వరసను దున్నిన వజ్రాలిస్తానంటుంది, భూమి.

వలపల దాపల

వ్యవసాయం వెర్రివాని చేతిరాయి.

వస్తుగుణం తెలియనివాడూ వైద్యంలో మొనగాడే.

వస్తూ యిల్లు నింపుతుంది, పోతూ పెరళ్ళు నింపుతుంది.
(ఆరిక)

వాడపల్లి తీర్థానికి వడుగుడుపళ్ళు. (మామిడి)

వానముందు ఉరిమినా, మాటకు ముందు ఏడ్చినా తుద ముట్టదు.

వానకు మఖ, శ్వానముకు చిత్త. (ఋతువు)

వానతో కరువు, పెనిమిటితో దరిద్రం లేదు.

వాన రాకడ ప్రాణ పోకడ తెలియదు.

820. వాన కురిస్తే వాతలు మానునా?

వానలు కురవాలి వరిచేలు పండాలి.

వానలుంటే పంటలు, లేకుంటే మంటలు.

వానలు కురిస్తేనే వసుంధర.

వాన లెక్కడంటే దానధర్మాలున్న ధరణిలో అన్నాడట.

విత్తనాలు వచ్చినా వ్యవసాయం వదలకు.

విత్తనముకొద్దీ మొక్క.

విత్తనం చెడినా వ్యవసాయం విడువకు.

విత్తనాలుంటేనే పెత్తనాలు.

విత్తనం లేనిది విశ్వంలో లేదు.

830. విత్తగా విత్తగా చిత్తడినేలైనా చిత్తుగా పండుతుంది.

విత్తనమొకటి పంట మరొకటినా?

విత్తకుండానే కోద్దామనే వెంగలి.

విత్తుకంటె క్షేత్రం మెరుగు.

విత్తు చల్లుటకు విసుగుకూడదు.
విత్తుకొద్దీ పంట.
విత్తు మంచిదైతే చెట్టూ మంచిదే అవుతుంది.
విశాఖ పడితే పిశాచి పట్టినట్లు.
విశాఖలో వర్షం వ్యాధులకు హర్షం.
విశాఖ వరదలు, సంక్రాంతి మబ్బులు. (ఇబ్బంది)
840. విశాఖ వస్తుంది, మందలు మెట్టను కట్టమని.
విశాఖ కురిస్తే పంటకూ విషమే.
విశాఖ చూచి విడువర కొంప.
వీతెరిగి మాట, కీతెరిగి వాత.
వృష్టికి ప్రమాణం ఉత్తరహస్తలు.
వెద అదునున వెలుగులో చల్లినా మంచిదే.
వెనుకకు పోతే తన్ను, ముందుకు వస్తే పోటు.
వెన్ను మూరెడు, దంటు బారెడు.
వెయ్యి ఆవులున్నవానికి ఒకటి యెగజేపితేనేమి?
వెయ్యి మోపులు వేకువజామున లోకువే.
850. వెయ్యి పుట్ల వడ్లకు ఒక చిలక పురుగుచాలు.
వెయ్యి యెకరాలున్నా వెర్రివాడు వెర్రివాడే.
వెలిపొలాన్నీ, వెధవపిల్లనీ విడువరాదు.
వెలుగు పంటను గాచు.

వేపపిండి యెరువు
వేములు కాస్తే భూములు పండును.
'వేళ్ళతో వెంపలి వేసిరా? కాయలతో క్రానుగ వేసిరా?
నేను పండటానికి.' అందట చేను.
వేరులో పురుగుపుట్టిన చెట్టు చచ్చినట్లే.
వ్రేలంత చోటిచ్చిన డోలంత నష్టమిచ్చును.
వేళ తెలిసి విత్తుము.
860. వేళంగి రైతులూ వేల్పూరి రైతులూ. (ఎన్నదగినవారు)
వేసంగిని భూమి దున్నితే కాసులు యిస్తుంది.
శయనైకాదశి తెలిసినవాడే శాస్త్రకారుడు.
శింగిడి వేస్తే పదిహేను రోజులు వర్షం.
శివరాత్రికి జీడికాయ, ఉగాదికి ఊరుగాయ.(మామిడిపిందెలు)
శివరాత్రికి శివశివా! అని పోతుంది. (చలి)
శివరాత్రికి చింతాకంత వెట్ట.
శివరాత్రికి చంక లెత్తనీయదు. (చలి)
సముద్రం ఉరిమితే వానతప్పదు.
సముద్రానికి ఏతామెత్తినట్లు.
870. సముద్రాలు దాటవచ్చుగాని సంసారం దాటలేము.
సంసారి తిరిగి చెడెను, సన్యాసి తిరుగక చెడును.
సంసారి బీద, భూమి బీద.

సంరక్షణ లన్నిట్లో పశుసంరక్షణే పవిత్రం.
సాగుబడి చేస్తేనే సంసారి, దున్ని తేనే రైతు.
స్వాతి కురిస్తే చట్రాలు కూడా పండుతవి.
స్వాతి వర్షం చాముకు హర్షం.
స్వాతి విత్తనం స్వాతి కోపులు.
స్వాతి కురిస్తే చట్రాలక్రింద వెన్ను.
స్వాతి కురిస్తే చల్ల పిడతలోకీ రావు. (జొన్నలు)
880. స్వాతి కురిస్తే చీమకైనా తాపము.
స్వాతి కురిస్తే భీతి.
స్వాతి కురిస్తే మూడుకార్తెలూ కురుస్తాయి.
స్వాతి కురిస్తే మోతీ పంట.
స్వాతి కురిస్తే సముద్రాలు నిండుతాయి.
స్వాతివాన చేనుకు.
స్వాతివానకు ముత్యపు చిప్పవలె.
సింహాలో చేరి ఊడ్చడమున్నూ, కన్యలో కంగాపింగా ఊడ్చడమున్నూ.
సున్నం తండ్రిని ధనికునిగాను, కొడుకును దరిద్రునిగాను చేస్తుంది.
సూతికావాతం వచ్చిన గొడ్డుకు చూడగానే మందు.
890. సూక్ష్మంలో మోక్షం.

సెట్టి బ్రతుకు గిట్టిన తెలియును.

హస్త ఆదివారం వస్తే చచ్చినంత వర్షం.

'హస్త ఆదివారం చస్తిమోయి, గొల్లల్లారా! రోజుకు ఒకదాన్ని పట్టి యీడవండి.' అన్నవట మేకలు.

'హస్త ఆదివారం చస్తిమి గొల్లల్లారా! బండ్లమీద దొడ్లు వేయించండి!' అని మేకలు మొరపెట్టినాయి.

హస్తకార్తెలో చల్లితే అక్షింతలకైనా రావు.

హస్తకు అణుగుపొట్ట, చిత్తకు చిరిపొట్ట.

హస్తలో ఆదిపంట, చిత్తలో చివరిపంట.

హస్త చిత్తలు వరుస్తైతే అందరిసేద్యం ఒకటే.

హస్తనుచూచి అందరం పోదాము.

900. హస్త పోయిన ఆరుదినాలకు అడక్కుండా విత్తు.

హస్తలో అడ్డెడైనా కావు.

హస్తలో అడ్డెడు చల్లుటకంటె చిత్తలో చిట్టెడు చల్లుట మంచిది.

హస్తలో ఆకు అల్లాడితే, చిత్తలో చినుకులేదు.

హస్త కురవకపోతే విత్తినవాడు, విత్తనివాడూ ఒకటే.

హస్త ఆరుపాళ్ళు, చిత్త మూడుపాళ్ళు.

హస్తలో చల్లితే హస్తంలోకీ రావు.

క్షామాన జొన్న, వర్షాన వడ్లు.

క్షామం వచ్చిందంటే సస్యాలు పండకే.
క్షేత్రమెరిగి విత్తనం, పాత్రమెరిగి దానం.
910. క్షేత్రమెరిగి బీజము, గోత్రమెరిగి దానం.
క్షేత్రం మంచిదైనా చెడ్డవాడు చెడ్డవాడే.
క్షేమానికి సేద్యానికి చెలిమి.



# నానాదేశ వ్యవసాయ సామెతలు

## అరబ్బీ సామెతలు.

1. అప్పుడప్పుడు లభించే అవకాశాలు ఆకాశమందలి మబ్బు
వలె అంతరించేవేగాని నిలిచేవిగావు.
2. కోపమును నిగ్రహించుకొని నడిపిన పని పరిపాలనవంటిదే
3. ధనమునకు దాపరికము, సేద్యమునకు వెల్లడి.
4. ముండ్ల చెట్టు బంకకే పట్టుత్వము.
5. లోభి వర్షము కురియని వేసవిమేఘము వంటివాడు.

## ఆంగ్లేయ సామెతలు.

1. ఇనుము ఎఱ్ఱగా కాలి యున్నపుడే సాగగొట్టు.
2. ఎంత పెద్ద చెట్టున కంత పెద్దపాటు.
3. గాలివానకు కావలసినంత విశ్రాంతి.
4. గాడిదకు తన కూత శ్రావ్యమే.
5. తేనెటీగకు తీరుబడిలేని పని.
6. పంట హెచ్చినకొద్దీ బాధ్యతలూ హెచ్చుతాయి.
7. బద్దలైన గంట బాగుగా మ్రోగదు.
8. మాటలు ఆకులవంటివి, చేతలు పండ్లవంటివి.
9. రెండు నలుపులు కలిసి ఒక తెలుపు కానేరదు.
10. విరుగుటకన్న వంగుట శ్రేష్ఠము.

## వ్యవసాయ సామెతలు

### ఇటలీ సామెతలు.

1. అప్పులేకుండుటే ఐశ్వర్యలక్షణం.
2. అరిచే కుక్క వేటకు పనికిరాదు.
3. ఒకే జోడు అందరికీ సరిపోదు.
4. కంచె మంచిది కాకున్న అంతా దాటుతారు.
5. బాట బాగుండకపోతే పరుగెత్తపోకు.
6. బురదనీటియందేదీ ప్రతిఫలించదు.

### ఆఫ్గనిస్థానపు సామెతలు.

1. కోడి కూయకున్నా తెల్లవారకపోదు.
2. గాడిద కెన్నేళ్లువచ్చినా యజమాని యింటిని గుర్తు పట్ట లేదు.
3. గాడిదతో స్నేహం కాలితాపులకే.
4. ఎద్దు చేనుమేసిపోతే గాడిదకు చెవులు కోసినట్లు.
5. నల్లని దేశంలో తెల్లని వస్తువులకు ప్రకాశమధికం.
6. మేఘాలు నలుపైనా కురిసినవాన తెలుపే.

### కర్నాటక సామెతలు.

1. అధికమాసం కరువులో వచ్చినట్లు.
2. అరిష్టానికి అంగారకుడే గురి.
3. ఆముదం కొలిచేతప్పు యెప్పుడూ జిడ్డే.

4. ఆవు నలుపైతే పాలు నలుపా ?
5. ఆవురంగు పాలనుబట్టి తెలుస్తుందా ?
6. 'ఆచార్యుల కుమారుడను, శాస్త్రులవారి అల్లుడను ! ఘృతమంటే యెరుగనా ? ఆవుపేడ.' అన్నాడట.
7. ఎద్దుకి కొబ్బరికాయ యిస్తే యేమిచేస్తుంది ?
8. ఎద్దుముందు టెంకాయ కొట్టినట్లు.
9. కంచెయే చేను మేసిన కాచువారెవరు ?
10. కంటివంటి ప్రకాశము లేదు, మంటివంటి ఆధారము లేదు.
11. కప్పలు కూస్తే వర్షము పడినట్లు.
12. కుప్పపై పరుండి ఉప్పరిగ కలగన్నట్లు.
13. కోడికి గజ్జెలు కడితే కుప్ప కుళ్ళగించకుండునా ?
14. గిన్నెడన్నము ఉడికినదీ లేనిదీ ఒక్క మెతుకు చెప్పిన చాలును.
15. చెరకు వంకరైన తీపి ఉండదా.
16. చెరువుకు నీటిఆశ, నీటికి చెరువు ఆశ.
17. చెట్టై వంగనిది మ్రానై వంగునా ?
18. చేతికందిన గాలి నోటికి రాదు.
19. చేపలు నీటిలో మునుగుట స్నానమవుతుందా ?
20. తోట మూడుమూరలు, కాయ ఆరు బారలు.
21. తడకల కొంపలోనైతే దీపాలు వెలుగవా ?

22. దున్నపోతుమీద వర్షించినట్లు.
23. దున్నదగ్గర వీణ వాయించినట్లు.
24. దేశం యెవరు యేలుతున్నా ధాన్యం దంచితేనే బియ్యం అవుతాయి.
25. నల్లఆవుపాలు కూడ తెల్లగానే వుంటాయి.
26. నీరులేని తావని మెట్టను గ్రామం కట్టుకున్నట్టు.
27. నూతిలో నీరుంటే తోడుకోవాలిగాని తనంతటనే పైకి వస్తుందా ?
28. నేల యెల్లాటిదైతేనేమి, ఒక్క దొడ్డిగా వుంటేనయం.
29. నేల కొంచెమైతేనేం, వరిపండించు.
30. పుట్టపై బాదిన పాము చచ్చునా ?
31. పేడ ఎరువుకంటె పిండిదుక్కి మేలు.
32. పేడారిన గింజ చెడిపోదు.
33. పేదవాడా ! పెసర చల్లుకో.
34. పైరుకు రాగులు, భాగ్యానికి మేకలు.
35. పొగాకుకు పొడినేల.
36. బియ్యం చల్లితే కాకులు చేరుతాయి.
37. మాలపల్లి ఎరువు అన్ని ఎరువులకంటె అధికఫలం యిస్తుంది.
38. మెత్తగా దుక్కియైననేల వ్యర్థంగాదు.
39. రోట్లో కూర్చుంటే రోకటిపోటుకు సిద్ధపడాల్సిందే.

## వ్యవసాయ సామెతలు

40. లోతుగాను, పూర్తిగాను దుక్కి దున్నాలి.
41. వర్షం లేకుంటే యేపనీలేదు.
42. విత్తనంకొద్దీ మొక్క.
43. వెన్నలా దున్నితే వెన్నులుకేం కొదువ.
44. సజ్జకు కాలు వాసి దుక్కి చాలు.

## చీనా సామెతలు

1. కడ్రవేళ్లు మిగిలినా గరిక చిగుర్చక మానదు.
2. కష్ట సంపాదన, ఇష్టభోజనము.
3. చంద్రుని గుండ్రదన, మేఘాల స్థిరత్వం ఎంతో కాలం ఉండవు.
4. చెట్టును గొట్టిన నీడ మాయమవదా?
5. చౌకవి మంచివిగావు, మంచివి చౌకగావు.
6. తగపండిన పండు తానే పడును.
7. తగపండిన పండైనా తానే ఒకనినోట పడదు.
8. తిన్నని పనులు వన్నెకెక్కు.
9. దప్పికొనకమున్నే త్రవ్వుము బావి.
10. పెద్దచెట్టుకు సుడిగాలి పెనుభూతము.
11. పిల్లికై గోవును పోగొట్టుకున్నట్లు.
12. మంచి గుఱ్ఱానికొక దెబ్బ, మంచిమనిషికొక మాట.
13. మబ్బులు చెదరిపోయినా వానసీరు నిలచేవుంటుంది.

## వ్యవసాయ సామెతలు

14. మేఘాలు లేనిదే మేదిని వానలుండునా?
15. విలుచుటకు ముందే విక్రయించే సులువు చూడాలి.

## జపాను సామెతలు.

1. ఆడుకోడి అరిస్తే యిల్లు అడుగంటడమే.
2. ఎండిన మోడుకు ఎర్రనిపూలు తగిల్చినట్లు.
3. ముత్యపుచిప్పతో మున్నీరు పారజల్లినట్లు.
4. రాలిన పూవు రెమ్మ కెగయదు.

## జర్మను సామెతలు.

1. గ్రుడ్డుపెట్టుకోడి అరచినట్లు.
2. గ్రుడ్డి గుర్రమున కొరకే త్రోవ.
3. త్వరగా పండడం, త్వరగా చెడడానికే.
4. దున్నుతూ వుంటే నాగళ్లూ, పారుతూంటే నీళ్లూ. (బాగుంటవి)

## టర్కీ సామెతలు.

1. గొప్ప నదులు ధ్వనిగావించవు.
2. నాగలి మంచిదిగాకుంటే యెడ్లేమిచేస్తాయి?

## తమిళ సామెతలు.

1. అన్నం లేకుంటే జొన్న సాగుచేయి.
2. ఆడినెలలో ఆకులు రాలినట్లు.
3. ఆరిక వెర్రివానికైనా పండుతుంది.

4. ఇసుకనేల దున్ని బాగుపడ్డవాడూ, రేగడినేల దున్ని చెడినవాడూ లేడు.

5. ఎండిన చెట్లు ఎన్నటికీ చిగుర్చవు.

6. ఎక్కువ తేమలో విత్తుట, రెండూళ్ళ వ్యవసాయము, ఇద్దరు భార్యలు బాగుపడడానికి కాదు.

7. ఏనుగు నెక్కినవాడు దిడ్డిగంతన దూరగలడా?

8. ఐదుసార్లు గొర్రెలమంద కట్టడం, తైనెలలో దున్నడం సమానము. (జనవరికి వచ్చును)

9. ఒక రకం నేల మరోరకం నేలకి ఎరువు.

10. కంచెలేని చేను, విరామంలేని గొడ్డు.

11. కంచెలు ముసర జాడ్యము నాపును.

12. కర్రుమొనతో దున్నాలి, న గేటి మొదలుతో చదును చేయాలి.

13. కలుపు తీయనివాడు కోయడు.

14. కాగిన నేలను విత్తుట, వెలయాలి గర్భము ఒకటే.

15. కాణినేలలో చెఱుకు సాగుచేయి.

16. కారుజొన్న మేసే కోడెకు కైలాసమెందుకు?

17. కారు వరికి గొర్రెలమంద, పిషాణముకు రొట్ట ఎరువు.

18. కొండ పగులగొట్టి ఉలవ చల్లు.

19. కొర్రలు కరువు పెంచును.

20. కొత్త కృషికి పాత తటికేనేల మేలు.

21. కోతలకాలంలో ఎలుక కేడుగురు భార్యలు.

22. గడ్డపారల కలవిగాని బండలైనా చెట్ల వ్రేళ్ళకు పగులును.

23. గడ్డిని తెగగొట్టేట్టు దున్నరాదు.

24. గయాళు విడిచిన నేలలో విత్తును.

25. గాలిపాటు చూచి ధాన్య మెగురబోయుము.

26. గొడ్డలిలో దూరిన కఱ్ఱ తనవాళ్ళనే నాశంచేస్తుంది.

27. గొడ్డు కొరికిన కొయ్యకాలు గొఱ్ఱెకు చాలు.

28. గొఱ్ఱెలమందకంటె లోతు దుక్కి మేలు.

29. గొఱ్ఱెలపెంట యేడాది, ఆవులమంద ఆరేళ్లు.

30. గొఱ్ఱెపెంట మొక్కలకీ, నీలియెరువు వరికీ.

31. చక్కని దుక్కి చెప్పన్నవిధాల మేలు.

32. చామ పండినపుడు, చక్కిలి (మాల) పడుచు సమర్తాడి నపుడు. (గణ్యత)

33. చిత్తినెలలో దుక్కి పుటముపెట్టిన పుత్తడి. (ఏప్రియల్ నెల)

34. చెముడు కంచెకు, చేనికి రేవడి (శ్రేష్ఠమైనవి)

35. జానెడులోతు దుక్కి, మూరెడెత్తు ఎరువు సమం.

36. ధర్మమున కిచ్చిన ఆవును పండ్లుపట్టి చూచినాడట!

37. ధాన్యం ధనముకాదా? మాన్యుడు పూజ్యుడుకాదా?

38. ఫలానికి తగిన బీజము, నేలకు తగిన నీరు.

39. మీగడ మ్రింగేవానికి వెన్న యెట్లు వస్తుంది?
40. యజమాని చూడనిచేను ఎంత పెరిగినా నష్టమే.
41. విత్తు లేక చెట్టు లేదు, చెట్టు లేక విత్తు లేదు.
42. నెలుగు పైరుమేస్తే కాచేవారెవరు?
43. స్వర్గానికి పోతూ చంకన యేకులరాట్నం ఎందుకు?
44. సాహసం లేనివాడికి కత్తి సరిగా తెగదు.
45. క్షామ కాలానికి నామమాత్రం లాభము.

## తిరుక్కురల్ సామెతలు.

1. తోటకు వర్షము, దూడకు గడ్డి
2. దుక్కిలేని చేను, తాలింపులేని కూర.
3. దుక్కి చాలని చేనికి ఎరువెంత పెట్టినా వ్యర్థమే.
4. దుక్కి దున్నిన లెస్సగా గాలిపారి, ఎండిన నేల రెట్టిపండు.
5. దుక్కికి లోతుచూడు.
6. దుక్కి కొలత లేకుంటే పంటకొలత ఉండదు.
7. దుక్కిఎద్దు చావు, పడకలో పెళ్లాం చావులాంటిదే.
8. నల్లరేగడిలో సెనగలు విత్తు.
9. నీరులేని పైరు, నూనెలేని జుట్టు.
0. నూతిని నువ్వురక్షిస్తే, నూయి నీ పొట్టను రక్షించు.

## పరాను సామెతలు.

1. కందెనవేయని బండికి కావలసినంత సంగీతం.
2. కోడి నలుపైనా గ్రుడ్డు తెలుపే.

3. గడ్డి కుప్పలో సూది పారవేసుకొన్నట్లు.
4. నడిచేదారిలో గడ్డి మొలవదు.
5. పాతకర్రకెన్ని వంకలున్నా బాగానే కాలుతుంది.
6. వాడుకలో అరిగినా మంచిదేగాని యినుముకు త్రుప్పు పడితే అంతా నష్టమే.
7. సముద్రాన్ని పొగడుతామేగాని నేలను విడవము.

## పారశీక సామెతలు.

1. ఎంతమంచి కత్తియినా తన పిడిని గంటు పెట్టలేదు.
2. కాలక్షేపం లేకపోతే కంచెమేకను కొనుక్కో.
3. కొఅగాని ముండ్లడొంకలో గులాబిపువ్వులా ?
4. మిరపకాయ చిన్నదని మేలమాడకూడదు.

## బంగళా సామెతలు.

1. అల్లె పొడుగుండాలంటే తుపానుకు వెరవాల్సి వస్తుంది.
2. అరటికాయలు కోసి అరటిపట్టల్లోనే కట్టినట్లు.
3. ఆకాశాన పట్టేగ్రహం అంతా చూచేదే.
4. ఆవు రాలేదంటే ఎద్దును కట్టుకు పితుకమన్నాడట !
5. ఒంటి చక్రంతో బండి ఎప్పుడూ పారదు.
6. కొట్లు వేయబడువాడొకడు, దాని కూర్పులు లెక్కపెట్టే వాడొకడు.
7. గ్రుడ్డివాడు కోలగోలోపడియినట్లు.
8. గుర్రమును జూచి కుంట నారంభించినట్లు.

9. చక్కెర మోసిన ఎద్దు.
10. చచ్చిన ఆవుమీద చెప్పులు ఉంచినట్లు.
11. తన చల్ల పుల్లనిదని తా జెప్పుకొనునా?
12. నయమున సూదిని దూరి, నాగేటినుండి వెలువడినట్లు.
13. నీ చక్రాలకి ముందు కందెన పెట్టుకో.
14. పండ్లు చెట్టుకు భారమా?
15. పనసపండులో మామిడిపండ్ల రసముండునా?
16. పాదపముకంటె పండ్లు బరువు.
17. పెరుగును, పులికడుగును పెనకున యైనట్లు.
18. పెరుగు రాచుకొన్నవానికి బుగ్గి భయమేమిటి?
19. మామిడికర్రతోనా రోకలి చేయడం?
20. మొదట చేదు, తుదను తీపి.
21. వెన్నెలచే మినుగురుపురుగు వెలసినట్లు.
22. వెలుపల వేడుక, లోపల కసవు.
23. సూదిలా ప్రవేశించి, నాగలికఱ్ఱులా ప్రామనుకొన్నట్లు.

బడగా సామెతలు.

1. ఎద్దు ఎండకు ఎనుబోతు నీడకూ.

బైబిలు సామెతలు.

1. చెట్టు దాని పండ్లవలన దెలియబడును. (మత్తయి 3-14)
2. చేతిలో చేట, కళ్ళంకొట్టులో గోధుమలు, ఆరని అన్నంతో బాటు. (లూకా 3-14)

3. పండినప్పుడు సేద్యగాడు వెంటనే కొడవలితో కోయును. (మార్కు 4–29)

4. ప్రతిచెట్టు తన ఫలమువలన తెలియును. (లూకా 6–44)

5. మెరుపు తూర్పునపుట్టి, పడమట ఏలాగున కనబడునో (మత్తయి 24–2)

6. సాయంకాలం ఆకాశం యెఱ్ఱనైతే వర్షం రాదనీ, ఉదయాన యెఱ్ఱగావుంటే వాన వచ్చుననీ తెలుసుకో. (మత్తయి 16–2)

## మలయా సామెతలు.

1. అరటిచెట్టు రెండుసార్లు కాయవు.
2. ఇసుకను కురిపించినట్లు.
3. చిక్కుడుగింజకు తన పాదే తెలియదు.
4. చెరువుచెంత జొంపములు వర్ధిలినట్లు.
5. చెరకు సాగు పెదవులమీదే చేయ సాగినట్టు.
6. చెలగ పెదవులమీద చెరకు నాటినయట్లు.
7. చెవులుపట్టి లాగిన రాకుంటే పైపని కొమ్ములు పట్టి లాగడమే.
8. దారితప్పితే మరల బాట మొదటికి రావలసినదే.
9. పెయ్యను రక్షించమని పెద్దపులికి వప్పజెప్పినట్లు.
10. బీజంబు తన పైతోలును బిరాన మరచినట్లు,
11. మురికిగుంట చుట్టూ గాబుచేరదా ?

## మళయాళీ సామెతలు.

1. కరిచేది చెరకు, పట్టేది అనుము.
2. కార్తికంపోతే వానలేదు, కర్ణుడుపోతే సేనలేదు.
3. గుర్రపు పరుగు, ఏనుగు నడక సమము.
4. గుర్రానికి కొమ్ములిస్తే మలనాడులో ఒకరినీ ఉంచదు.
5. చెరుకని చెప్పి వేరుతో పెరుకకూడదు.
6. చెరుకుతోటలో ఏనుగు దూరినట్లు.
7. నిప్పులో మొలిచినది ఎండకు వాడదు.
8. నీరున్న చోటనే బురద.
9. పేదవాణ్ణి చూస్తే పేలాలు త్రుళ్ళును.
10. వృక్షాలకు వేళ్లు బలము, మనుష్యులకు బంధువులు బలము.
11. వృక్షానికి కాయలు బరువా?
12. మేకలు మేసిన అడవిలాగు.
13. మేకలు తిరిగితే అడవికాదు, రాజు తిరిగితే ఊరుకాదు.
14. మొలిచే చెట్టు మొలకలోనే తెలియును.
15. సారమెరిగినవాడే సర్వజ్ఞుడు.

## మరాటీ సామెతలు.

1. తుంపురులు వ్యవసాయానికి తెంపుగూర్పవు.
2. విడువక పడుతూంటే నీటి బిందువులే నదులవుతాయి.

## రష్యా సామెతలు.

1. చేలో గుఱ్ఱాన్ని, ఇంట్లో పెళ్లాన్ని నమ్మరాదు.
2. పశువు నాలుకలు పెద్దవేగాని పలుకగలవా ?
3. మేకకు జ్ఞాపకముండేదంతా మేతప్రసంగమే.

## స్పెయిను సామెతలు.

1. కోడిపెట్ట యెక్కడున్నా ధ్యానం గ్రుడ్ల మీదనే.
2. చప్పుడుచేసే గుఱ్ఱపు నాడముకు మరోమేకు కొట్టడమే మందు.
3. పదిసార్లు చోటు పిరాయించిన చెట్టు కాయదు.

## హిందుస్థాన సామెతలు.

1. ఆకసమంచున కంతెరాయంబు వృక్షములు.
2. ఆవుల నెంచికొన్న దొంగిలింపబడవు.
3. తగ్గుగోడలను దాటదే యుదకంబు.
4. తొలుత తోయంబుతోడనే మన్నా.
5. పండిన మామిడి పరగంగవంగు, ఆముదపుచెట్టు అట్టె నిగుడు.
6. మేకలే మడకలు దున్నితే, ఎద్దుల నెవడు కోరును ?
7. విడువబడిన యెద్దు వేగ కొట్టముదారిచూచు.
8. వేగ బండ్లదిని విత్తుల నమ్ము.